శ్రీ

# ముక్తావళీనాటకము.

ఇది

బళ్లారిలోనుండిన డిస్ట్రిక్టు కోర్టువకీలు

"ఆంధ్రనాటక పితామహ" యను బిఱుదువహించిన

ధర్మవరము - రామకృష్ణమాచార్యులచేత

రచియింపఁబడి

డి. కె. కృష్ణమాచార్లు, వారిసహోదరులవల్ల ప్రకటింపబడియె.

మొదటి కూర్పు.

చెన్నపురి:

యస్. మూర్తి అన్డ్ కంపెనీవారి,

కపాలి ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె

1915



[క్రయము రూ. 1-0-0.]

శ్రీ

# ముక్తావళినాటకము.

## పూర్వకథ.

పూర్వకాలము ఘూర్జరరాజు భూపాలరాజునకు కప్పమిచ్చుచుండి తర్వాత ప్రబలస్థితికి వచ్చినందున ఘూర్జరరాజునకే భూపాలరాజు కప్పమిచ్చునట్లు తటస్థించెను. భూపాల రాజకుమారుఁడైన సోమశేఖరుఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడై ప్రబలికప్పమునకు తిరుగుబాటుచేసి ఘూర్జరపురిసేనాని యొద్ద కొక బ్రాహ్మణుని పంపియుండెను. వాని యొద్దనున్న లిఖితసాధనములు సాధింపవలయునని సోమశేఖరుఁడే వేషాంతరమున బ్రాహ్మణునితో ఘూర్జరపురికి పోవుటకు ప్రయాణమయ్యెను. ఈసమయమున ఘూర్జరరాజుతనయాంతఃపురస్త్రీలు మొదలగువారితోఁగూడ వింధ్యపర్వత ప్రాంతమునకు విహారార్థమునకు పోయి యుండినకాలమున నాటకము ప్రారంభమగును.

శ్రీ

# ఈ నాటకమునందలి ముఖ్యపాత్రలు.

# తత్ప్రవేశస్థలములు.

---

## పురుషులు.

చారువర్మ.—ఘూర్జరరాజు ప్రవేశము. అంకము I రంగము. 1-4. అంకము II రంగము. 4.

సునీతి.—చారువర్మ మంత్రి. ప్ర॥ అం॥ I రం 1-4. అం॥ II రం 4.

సువిచారుఁడు.—చారువర్మమంత్రి. ప్ర॥ అం॥ I రం 1-4. అం॥ II రం 4.

నాగకేతుఁడు.—ముక్తావళిని వరియించియుండిన వాఁడు. ప్ర॥ అం॥ II రం 4 అం॥ III రం 4 అం॥ IV రం 1-3 అం॥ V రం 3. (జగంధరుఁడని, బోయయనియు వేషాంతరములు గైకొన్న వాఁడు.)

మీననాథుఁడు.—సోమశేఖరుని పినతండ్రి. ప్ర॥ అం॥ II రం 2-4 అం॥ IV రం 3 అం V రం 3. (బాదరాయణుడను యతివేషాంతరముఁ గైకొన్నవాఁడు.)

సోమశేఖరుఁడు.—భూపాలరాజపుత్రుఁడు, కథానాయకుఁడు. ప్ర॥ అం॥ I రం 2-3-4 అం II రం 2-3 అం III రం 5 అం IV రం 3 అం V రం 2-3. (విలాసకుఁడను బ్రాహ్మణ మాణవేషమున మెలగినవాఁడు.)

చతురవర్మ.—పాండ్యరాజు, కళావతితండ్రి. ప్ర॥ అం III V రం 1-3.

అంగారశర్మ.—(కేరళరాజు) ప్ర॥ అం V రం 3.

మలయపత్తుఁడు.—(వైద్యుఁడు) ప్ర॥ అం IV రం 2-4 అం V రం 3.

వీరసేనుఁడు.—చారువర్మ పుత్రుఁడు, ముక్తావళిసోదరుఁడు. ప్ర॥ అం V రం 3.

అనిమేషుఁడు.—కారాగృహ రక్షకుఁడు. ప్ర॥ అం II రం 2-4.

## స్త్రీలు.

ముక్తావళి.—సోమశేఖరుని భార్య, కథానాయిక. ప్ర॥ అం I రం 3-4 అం II 1-2-3 అం III రం 3-6-7-8 అం IV రం 1-2-4 అం V రం 1-2-3. (పురుష వేషమున నీలకేతు నామమున కళావతిచే వరింపబడియుండెను.)

ప్రవాళావల్లి.—ముక్తావళిసఖి. ప్ర॥ అం I రం 3.

నీలాలక.— డిటో ప్ర॥ అం I రం 3 అం II రం 1-4.

చారుహాస.—అనిమేషుని భార్య. ప్ర॥ అం II రం 1.

కళావతి.—చతురవర్మ పుత్రి. ప్ర॥ అం III రం 7-8 అం IV రం 4 అం V రం 3.



## ఈనాటకములో ముఖ్యపాత్రలు.

### పురుషులు.

1. సోమశేఖరుడు—భూపాలరాజపుత్రుడు—ఘూర్జర రాజు విరోధి—కథానాయకుడు.

1a. విలాసకుడు—బ్రాహ్మణవేషముననున్న సోమశేఖరుని పేరు.

2. చారువర్మ—ఘూర్జర రాజు.

3. మీననాథుడు—సోమశేఖరుని పిన్నతండ్రి.

3a. బాదరాయణుడు—మీననాథుడు యతివేషము వేసికొన్నప్పుడు కలిగిన పేరు.

4. నాగకేతుడు—ఒకరాజపుత్రుడు ముక్తావళి నితనికివ్వవలెనని చారువర్మయుద్దేశించియుండెను.

4a. జగంధరుడు—నాగకేతుడు—కేరళమున చిత్రకారుడుగా నున్నప్పటి పేరు.

5. చతురవర్మ—పాండ్యరాజు—కళావతి తండ్రి.

6. నీలకేతుడు—ముక్తావళి పురుషవేషముననున్నప్పటి పేరు.

7. మలయదత్తుడు—పాండ్యరాజవైద్యుడు.

8. అనిమేషుడు—చారువర్మయొక్క మిత్రుడై సోమశేఖరుని చెరసాల గాచినవాడు.

### స్త్రీలు.

1. ముక్తావళి—ఘూర్జరరాజుకూతురు—ఈకథానాయిక—ఈయమ పాండ్యరాజ్యమున నీలకేతు నామమున పురుషవేషమున నుండెను.

2. కళావతి—పాండ్యరాజు కూతురు—ఈమె నీలకేతుని మోహించి పరితాపపడినకన్య.

3. చారుహాస—అనిమేషుని భార్య.

4. నీలాలక, ప్రవాళవల్లి—ముక్తావళి సఖులు.

శ్రీ

# ముక్తావళీనాటకము.



— నాంది —

శా॥ శ్రీలీలాసముదగ్రయై యనాదిలయయై క్షేత్రప్రభావేయయై।
కాలాతిక్రమయై యతిప్రథిత సంకల్పైకసంధానతా।
కేళీజాల విశాలతాంచిత త్రిలోకీ నిత్య సంత్రాణనా।
పాలుండై చను దేవదేవుఁడొసఁగుఁ భద్రంబులశ్రాంతమున్॥



## ప్రథమాఙ్కము-ప్రథమరంగము.

ఘూర్జరరాజగు చారువర్మ యాస్థానము.



[ప్ర: చారువర్మ-సునీతి-సువిచారుఁడు.]



చారు—చూచితిరే మంత్రులారా! ఈదురాత్ముఁడగు భూపాల పురాధీశుని కావరము! ఈజాబా వీఁడు మనకు వ్రాయవలయు?

(అనుబంధము 1.)

సునీ—రాజేంద్రా! మనక్షమాగుణమే యిందుకుఁ గారణము. ఇంకింక మనకైనఁ గరుణఁ జూపరాదు.

చారు—భూపాలపురిపై మనమింక దండు వెడలిపోవలయు.

సువి—రాజచంద్రా! ఆలకింపవలయు. తోఁచినయభిప్రాయము చెప్పకుండుట సేవక ధర్మమునకు వెలితిగదా? ఇన్ని దినములనుండి మనకు విధేయుఁడైయున్న భూపాల రాజిప్పుడు మమ్ముఁదిరస్కరించుటకుఁ గారణ మూహింతము. ధనగర్వమున నందమా? అందునకాస్పదము లేదు. మొన్న వానివిరోధితోఁ గలిగిన సంగ్రామమున కొంత

రో ప్రయత్నమొనరించి నిర్ధనుఁడై యున్నాఁడని వింటిమి. సేనాసామగ్రియందమా! అదియు లేదు. ఆయాహవముననే వానికిఁగల యేఁబదివేలసేనలో సగమున కెక్కుడు గా హతమయ్యె. సేనా ధనగర్వములు గాకున్న నింకేయ్యది? కాకుంజూడ వాని కుమారుఁడు సోమశేఖరుఁడనువాఁడు. నిజధనుశ్చలిత చండకాండ ప్రకాండ నిఖండిత మండలాధిపమండలుండై గండుమీఱియుండువాఁడు. వానిబలముచే వానితండ్రి నమ్మియున్నాఁడని తోఁచుచున్నది. వానివిక్రమము నొక పదియేఁడులక్రిందట జరిగిన యుద్ధముననే మనసైనికు లెఱిఁగిరిగదా? తనసైన్యమంతయు నశింపుచుండఁ జూచి యొక్కరుఁడై చండమండలాగ్రముధరించి రెండువేల సైన్యము నిండుసాహసమున ఖండించెను. ఆరెండవనాటియుద్ధమునఁ బరసైన్యమును వంచించి, యని సేయుచున్న యుభయ వాహినులట్లే సంగరమాడుచుండఁ, బ్రత్యర్థిపురము ప్రవేశించియందున్న సైన్యముం గృపాణమాత్రసహాయుఁడై నఱుమాడి దుర్గముసాధించెననియు వింటిమి. ఇట్టివాని సహాయసంపదగల యాభూపాలాధీశుని మనము మలకనగా నెంచరాదు.

కం. పరిపాటిగ యోచింపక
పరికింపక తారతమ్య భంగిఁగనక స
త్వరముగఁ గార్యాకార్యము
లిరవారఁగఁ జేయ నెంచు టెందును దగునే ॥

పూర్వాలోచనమొనరింపక యేకార్యమును గుమికిపడి సాధించుట కుద్యమించుట లగ్గుగాదు. ఇది నాకుఁదోఁచిన యభిప్రాయము.

సునీతి—రాజేంద్రా! ఈసువిచారుని యభిప్రాయము నాకేమియుఁ దృప్తికరముగా లేదు. ఈఘూర్జర రాజధానికి భూపాలపురీశుఁ డొక్కఁడుమాత్రమే మాండలికుఁడై యున్న వీనితోనేమని మనమూరకుండవచ్చును? ఏలినవారికిఁ బ్రాప్తు లగుదురు సామంతులు పెక్కండ్రు. ఒకఁడువోయిన నొకఁడొకఁడుపోయిన మా రాజ్య మశక్త రాజ్యమై యుపేక్షింపఁబడుఁగదా? సామంతకుంజరములకెల్ల ఘనదుర్విక్రమము సింహ స్వప్నప్రాయమై యొప్పారవారెల్ల నిదివఱకు భృశాత్మవ్యగ్రాంగులై భీతులై ఘనదాక్షిణ్య విశృంఖలాబద్ధులై తలచూపరాకుండెనుండిరి. వారెల్ల నీభూపాలునివలననే తిరుగఁబడి రైకమత్యముగలవారైరేని మనరాజ్యముండునా? ఈసువిచారుఁడు దీర్ఘయోచన మొనరింపకేకార్యమును సలుపఁగూడ దని నుడివె. స్థితికే సంకోచమొనరించు నసం దర్భపువేళ యోచనవలని ప్రయోజనమేమి? కుడ్యమున్నఁగదా చిత్రములేఖనము? ఆ కుడ్యమే మోపురాయి విడలి కంపోత్తంభితముకాఁగాఁ జిత్రమెక్కడిది? దానిఁజక్కఁ జేసికొనుట మానినఁజింతయేల? అది చక్కఁజేయుటలో గోడకీయపాయముకలిగిన నెట్లనియందురు. కలిగిననుమానె. దానికై యోజనపనిలేదు. ఆ సోమశేఖరుఁడెలఘు విక్రమసోమశేఖరుఁడేయయినను నొక్కరుఁడు వాఁడేమిచేయఁగలఁడు. సాహస మొనరింపఁజాలు వాఁడుగాక కార్యము సాధించువాఁడా?

చ॥ మనసున నెక్కుడౌ దురభిమానమదంబది మేరమీఱఁగా।
ననయము సోమశేఖరుఁడహంకృతి మైఁ గనలేకమమ్ముఁదాఁ।
జెనకుటసాహసంబొకటి చెల్లును గాక తలంచి చూడఁగాఁ।
దనకును నెకార్యసాధనము దానికినై వగపేల భూవరా॥

కావున మనము రణయానమే వెడలవలయు.

చారు—సునీతీ! సువిచారా! మీయిరువురి యభిప్రాయములు శ్లాఘ్యములుగానున్నవి. మన మాభూపాలపురీశున కొకకడ నే మనము పంపుదము. వానిదుష్కృత్యముల వానిమోమున వేసి సామోపాయమున వానికిఁగడమాట వచింతము. వాని ప్రత్యుత్తర ముఁదిలకించి కర్తవ్యము విచారింతము. ఆసోమశేఖరుని విక్రమక్రమములను మున్నునే విని నప్పుడు నాకత్యంతాశ్చర్యమును, నిర్భరానందమును, దుస్సహసంతాపమును గలుగుచుండె. వానిశక్తిబలమున నాశ్చర్యము, నిట్టివాఁడు నాకు సామంతుఁడై సహాయుఁడగుఁగదాయని యానందము, వాఁడొకవేళఁ దిరుగఁబాటినఁగంటి నెరసగునే యను భయమున సంతాపము. నేను భీతిల్లుచున్న క్లేజరిగినది. అయినను సామవిధానమున వాఁడు నిష్కారణముగాఁ గలహమునకు సాహసింపఁడని తోఁచుచున్నది. ఆజ్ఞాపత్రము వ్రాయింపుఁడు.

శా॥ ఆలోచింపఁగనయ్యెఁగార్యము లమాత్యశ్రేష్ఠులారాదయా
శీలస్వాంతతనూరకుంటిమిఁక నీక్షేమంబుపై నాసలే
కీలాగాడినవచ్చువారమిదె నిన్నేపార్పఁగా నంచు భూ
పాలాధీశునకంత్యశాసనము పంపన్మాకుమేలయ్యెడిన్॥

అదియుండనీ, మఱచియుంటి. మనసేనానియొద్దకా భూపాలపురి బ్రాహ్మణుఁడు వచ్చి మంతనములాడిపోయిననాటనుండి యాసేనానిపై మీరు కాపుంచియుంటిరే, యీవల వృత్తాంతమేమైనఁదెలిసెనా?

సువి—రాజచంద్రా! నాటనుండి విశేషములేవియు జరుగలేదు. ఆబ్రాహ్మణుఁడు మంతనములాడిపోయినదియొక్కటే. ఇంకను గాలక్రమమునఁ దెలియఁగలదు.

[ప్ర: సేవకుఁడు.]

సేవక—చారువర్మరాజచంద్రా! వింధ్యోపాంతమున నేలినవారి యాజ్ఞమేరకు సామగ్రులన్నియు సమకూర్పఁబడియున్నవి.

చారు—మంత్రులారా! మీరందరు నాయితముకండు. రేపే వెడలవలయు. ఈవసంత ఋతువంతయు మన మందే యుండవలయు. సేవకా! అంతఃపురమున నందఱిని బ్రయాణసన్నాహ మొనరింపుము. ఇంకఁబోవుదము.

(నిష్క్ర.)

శ్రీ

# ముక్తావళి నాటకము.

---

## ప్రథమాఙ్కము. ద్వితీయరంగము.

### వింధ్యోపాంతమున నడవి.

---

[ప్ర: సోమశేఖరుడు యోగి వేషమున.]

---

సోము—(స్వ) ఘూర్జరరాజగు చారువర్మ యిట్టి తీవ్రమయిన యాజ్ఞ వ్రాసియున్నాడు. ఈజాబున కనుగుణమైన ప్రత్యుత్తరము వ్రాయుచున్న మహాసైన్యముతో నేతెంచి భూపాల రాజ్యము నాక్రమించెద నని వ్రాసియున్నాడు. నామిత్రుడగు బ్రాహ్మణుడు వానిసేనానితో మాటలాడి వచ్చియున్నాడు. కొంతద్రవ్య వ్యయముమాత్రము కలిగినా యీ ఘూర్జరరాజే భూపాలుం డనుకొని యిచ్చుచుండిన లిఖితసాధనముల గ్రహింపవచ్చును. అప్పుడు నాయుక్తితో సకారణముగాను వాదమున కవకాశముండును. నేనే పోయి యీ సేనానితో మాటలాడ ప్రయత్నించెదను.

[ప్ర: బ్రాహ్మణుడు సన్యాసి వేషమున.]

సోమ—భయపడకుము. ఘూర్జరపురిసమీపమున కే వచ్చియున్నము.

బ్రాహ్మ—ఆహా! అంతయు సమీపమునకే వచ్చియున్నము.

సోమ—నీ కేలయింతభయము?

బ్రాహ్మ—సోమశేఖరా! తెలిసి తెలిసి యీ మొండితనమేల? నేనంతయు నా సేనానితో మాటలాడివచ్చియున్నానే? అన్నికార్యములు సాధింపఁగలుగుదు? నాయెడ నింతవిశ్వాసము గలుగకున్న నెట్లు? నినుఁజూచిన వెంటనే నఱుకవలయుననియున్న శత్రువుపురికి నీవే వచ్చుటచెల్లునా?

సోమ—బ్రాహ్మణోత్తమా! భీతిల్లకుము, నీయెడనా కవిశ్వాసములేదు. ఆ సేనానివలన సంగతులెఱింగి దానిపై ద్రోహచింతఁజేసి యొకకార్యము నెరవేర్పవలయు నని నా

కభిలాషుమునులేదు. మాకుఁగల లిఖితసాధనముల నీఘూర్జరరాజా స్వాధీనమున నుంచుకొనియున్నవాఁడు. వానిగ్రహింపవలయు నని నాయభిలాషము.

బ్రాహ్మ—ఇం దెవఁడైన నొక్కఁడు నిను గుఱుతించెనా యెంతటి కార్యమగును ?

సోమ—మిత్రమా ! నను గుఱుతింగినవారిం దెవ్వరున్నారు ? నీకేలయీభ్రాంతి ?

బ్రాహ్మ—ఇదేమిమాట ? ఒక్కఁడైన నినుఁజూచియుండరా ? ఇక్కడ రాజసైనికులు మనయుద్ధమునకు సహాయులుగా వచ్చియుండినవారుగదా ?

సోమ—నా రిప్పు డెక్కడ నున్నారు ? కొందఱు మాత్రము దప్ప నందఱును శత్రువులచే నిహతులుకాలేదా ?

బ్రాహ్మ—అకొందఱున్నఁ జాలదా ?

సోమ—అయిదాఱుసంవత్సరముల మున్నొక్కసారి చూచిన వారి కేమి జ్ఞాపకము?

ఉ॥ ఊరక యీవిచారమిది యెప్పుదు నన్నెఱింగియున్నవా ।
రేరును లే రూపమొక యించుకయేని యెఱుంగరానియా ।
కారముగాచె మేననిటుకప్పును వేషముచాయ బోయ యి ।
ప్పార నిప్రాణబంధువుల కైన ననుం గుఱుతింప శక్యమే ॥

నేనిప్పుడుండుస్థితిలో నాముఖ్యబంధువులైన నను గుఱుతింపఁగలరా ?

బ్రాహ్మ—సోమశేఖరా !

కం॥ ఎంతెంత నీవు చెప్పిన ।
సంతోషంబుప్పతిలదు స్వాంతంబునకుక్ ।
చింతలు దప్పవటంచుక్ ।
జింతించెద మదిని సోమశేఖర వింటే ॥

సోమ—అదిగో ! మరలనాపేరేల ? " పిశోర్కీ " యనుము.

బ్రాహ్మ—పిశోర్కియో గిశోర్కియో. కానిమ్ము. మనప్రాణములకు దైవమెక్కు పెట్టియుండ నీకు వేఱుబుద్ధి యేలపుట్టును ?

సోమ—ఊరక శంకింపకుము. పోదమురమ్ము.

(నిష్క్ర.)

---

శ్రీ

# ముక్తావళి నాటకము.

## ప్రథమాఙ్కము. తృతీయరంగము.

### వింధ్యప్రాంతాటవి.

[ప్ర: ముక్తావళి-ప్రవాళవల్లి-నీలాలక.]

అంపకము — (అనుబంధము 2.)

నీలా — ముక్తావళీ! ప్రవాళవల్లీ! మాలతికా! ఈదినము యెంత శీతలముగానున్నది? ఈ యపరాహ్ణమును నడిరేయి యనిపించుచున్నది. ఈదినసంతతతుషారములవలన నీ భూమిహిమానీవేళ యందలి చల్లదనముఁగలిగియున్నది.

ప్రవా — ఔను. ఈభూసతికి భాస్కరకరస్పర్శనములేమిఁ గలిగిన వియోగజనిత స్వేదమా యనుభంగి నున్నది.

నీల — ఈతరు ప్రకాండములు తమనీడ నాశ్రయించిన వారికఁదపన రోగముఁగలిగింపవని బద్ధకంకణములయినట్లు జలబిందువులచే రాజిల్లుచున్నవి.

ముక్తా — ఎంతటి గాఢాంధకారమును మాయింపఁగల యీ చండభానుఁడీ వృక్షముల నీడలఁదనుఁగబళించి కళాహీనుఁజేయు తమోగ్రహమో యను భీతినంగుళముఁ జే చాపవెఱచుచున్నాఁడని నాకుఁదోఁచుచున్నది.

ప్రవా — నీలాలకా! ఈ ముక్తావళి యాశయము కడుసొంపుగానున్నది. దినకర ప్రచార రహితమగు నీయటవి నెట్లు వర్ణించె !

నీలా — దీనికి నినకరస్పర్శనము మాత్రముగలుగవలయు.

(కోతులమూల్గినధ్వని.)

ముక్తా — ఇదియేమే? ఏదోధ్వని వినిపించె?

నీలా — ఆవైపున నెవ్వరో మూలుగుచున్నట్లుది.

ముక్తా—అయ్యెడకేపోయి విచారింతమురండు.

ప్రవా—ముక్తావళీ! మనకేటికే? భయంకరకానన మృగములకునికియగు నీఘనాటవి నిట్టియారావమబ్బురమా?

ముక్తా—ఇట్టిపగటివేళ వనమృగములెక్కడివో? పోయి పరికింతమురండు.

(వెనుక యవనికనెత్తఁగా సోమశేఖరుఁడు నెత్తురుగాఱుచు మూర్ఛిల్లియుండును ప్రక్కన సింహము చచ్చిపడియుండును.)

ముక్తా—చెలులారా! చూచితిరే? ఇతఁడెవ్వరో యిందు మూర్ఛిల్లియున్నవాఁడు. ఆ ప్రక్కన సింగముచచ్చిపడియున్నది.

ప్రవా—తెలిసెను. ఇతఁడు సింగముతోఁబోరాడి గాయములువడసి దానింజంపియున్నాఁడు.

ముక్తా—వీఁడు శబరవేషముధరించిన చంద్రకళావతంసుని చందమునున్నాఁడుగాని నిక్కంపుశబరుఁడుకాఁడు.

నీలాలకా! ఆసరసినున్న యుదకముంగొనిరమ్ము. ఈ నెత్తురుగడుగుదము.

నీలా—ముక్తావళీ! మనకేటికే యీప్రసంగము?

ముక్తా—చెలియా! ఇదిధర్మమా? ఇట్టివాని మనము విడిచిచనవచ్చునా? నీవుతెమ్ము పొమ్ము.

నీలా—(నిష్క్ర.)

ప్రవా—ముక్తావళీ! నీవన్నమాట నిక్కువము. ఇతఁడు వేషధారికాకున్న నీరూపమునకీతేజమా? ఈదుర్యత్నహర్యక్ష నిర్యాణకరణ వీర్యమా?

(పునః ప్ర|| నీలాలక జలకలశముతో.)

ముక్తా
ప్రవా } (సోమశేఖరుని ముఖముకడుగుదురు. వర్ణమంతయుమాఱును. కవచమువిచ్చెదరు రాజయోగ్యకవచములోనఁ గనుపించును. (విభ్రాంతిఁజెందుదురు.)

ముక్తా—ఆహా! ఇతఁడెక్కడికిరాతుఁడే? అమేయ మహిమోపేతుఁడగు సుకుమారుఁడు. ఇతని కరావలంబనముగలుగనే తరుణీమణి ధన్యతఁజెందఁదగియున్నదో? చెందియున్నదో? చెలులారా! మీరెట్లయినఁగరుణించి యీమనోహరునకుఁ బ్రాణదానమిచ్చితిరా మీరు ప్రాణసఖులనుట యప్పుడుగదా?

(అనుబంధము 3.)

అందఱు—(సోమశేఖరునికి శిశిరోపచారములఁజేయుదురు.)

సోమ—(కన్నులుతెఱచును.)

ముక్తా—కన్నులు తెఱచుచున్నాఁడు. (స్వ) ఇదియే మాయభిలాషము? ఈతండా నిశేషము? హృదయమా! నీకేటికింతొందర ?

సోమ—హా! హా! వనితామణులారా! నేనెందున్నాఁడను ?

ముక్తా—ప్రవాళవల్లీ! వచింపుము.

ప్రవాళ—నీలాలకా! ఊరకేలయున్నావు? ఉత్తరమిమ్ము.

నీలా—ఇదేమొయ్యారమే? మాకేలమాటలాడరాదు ? నేనొక్కతెనో యుంగుండునది?

ముక్తా—రాజకుమారా !

సోమ—తరుణీ! నేనెక్కడి రాజకుమారుఁడను బోమ్ము.

ప్రవా—ఆవేషము వేసికొన్నమాత్రమున నే స్వాభావికముగా దాఁగియుండఁగలతేజ మెందుఁబోవును ?

ముక్తా—

ఉ॥ నీయనురూపరూపసరణింగనుఁ గొంటిని రాజసూనుఁడనే ।
బోయనటంచునీకరణిఁ బోలినవేసము వారలెంచఁగా ।
నీయెడనుండ నేమికత మెవ్వఁడు వెన్నఁడు తత్ప్రసంగ మిం ।
కేయవియోగతాపములి లెంతయునుఁ దాఁచకయానతీయ్యవే ॥

నీవు దాఁచకుము. నీమోమునమ్మి రక్తసిక్తమైయుండినందున మేను కడిగినపుడు నీస్వరూపము వెలుపడియె. అదియట్లుండనను, నీలోఁబలనున్న రాజ్యసౌభాగ్య కవచములుండలేదా? నీవెన్వర విట్లుండుటకుఁ గారణమేమి ?

సోమ—(చూచుకొని) (స్వ) ఎవ్వరందు నీతరుణీమణి ? దీనిసౌకుమార్యాంగము నా యాయాసమునంతయు నడఁగించుచున్నది.

ముక్తా—రాకుమారా! నన్నుఁ దిగాఁజూడకుము. నీవృత్తాంతమానతిమ్ము.

సోమ—అబలా! నీవునన్నుఁబలుమారు "రాకుమారా" యని పిల్చుచుండ నేగొలని రాకుమారుఁడనేయయ్యెద. దేశదర్శనాభిలాషముఁబూని యిచ్చోటవచ్చుచుండ నీగహనమున నీసింగము నన్నుఁగొట్టెను. ఈగాయమునుండి వడలిన రక్తప్రవాహమునకు స్మృతి మఱచితిని. (భుజముఁజూపును.)

ముక్తా—ప్రవాళవల్లీ! నీలాలకా! చూడరే యెంతగొప్పగాయము. (అనికవచముఁజించి నీటిఁగడుగుచుఁ గన్నీరునించును.)

సోమ—అబలా! నీకేటికిఁ గన్నీరుగలిగె? నాకుఁగలబాధకై యగచెదవా ? వగచిన మది యేమిచేయఁగలదు ? (స్వ) ఔరా ! ఈయతివకరస్పర్శ మెంతానందముగలిగించె !

(ప్ర) తరుణీమణీ! నాకీనాఁడింత ధన్యతగలుగ నాపాలిభాగ్యదేవతవైవచ్చిన నీ వెవ్వతెవో యానతిత్తువా?

(అనుబంధము 4.)

ముక్తా—(లజ్జనభినయించును.)

ప్రవాళ—రాజపుంగవా! ఈకన్య పేరు ముక్తావళి. ఈమె ఘూర్జరరాజగు చారువర్మ కూతురు.

సోమ—హా! దైవమా! (మూర్ఛపోవును.)

ముక్తా—అయ్యో! ఇదియేమే నీలాలకా? మరల నీపురుషపుంగవుఁడు మూర్ఛిల్లెను? ఆకటా! ఈతఁడు కనువెఱచి మరలమాటలాడఁగలుగునా? ఏమిబాధ కలిగియున్నదో?

(లోపల గుఱ్ఱములధ్వని)

ప్రవా—ముక్తావళీ! ఇదిగో గుఱ్ఱములచప్పుడు. మనరాజసైనికులు వచ్చుచున్నట్లున్నది. పోదము.

ముక్తా—సైనికులువచ్చిన నేమిచేసెదరే? మీరెంతక్కటికము లేనివారే? ఈపురుషవరుఁ డిట్లుమూర్ఛిల్లియుండఁ బాసిపోనెంచెదరు?

నీలా—ముక్తావళీ! నీకుబుద్ధిచాలదు. మనసైనికులు మమ్మియ్యెడఁజూచిన నేమనరు? ఊరకరమ్ము.

ప్రవా } నీలా }—(ముక్తావళి నీడ్చుకొనిపోయెదరు.)

[ప్ర: రాజసైనికులు.]

1. రా. సై—ఆతటాకమునఁ జలపానముఁజేసి యిందింతవిశ్రమింతము.

2. రా. సై—ఇదియెవ్వరురా? ఎవరో మూర్ఛిల్లియున్నాఁడు! వేసము రూపము నిట్లున్నది.

3. సై—వీని నెక్కడనో చూచినట్లున్నది.

4. సై—ఇందిసింగముంజూచుము. దీనితోఁబోరాడి చంపియున్నాఁడు.

2. సై—వీని నెత్తుకొనిపోయి కాపాడ మారాజునకుత్తమము.

3. రా—ఇట్టిసింహాయతసత్త్వుఁడు భృత్యుఁడుగాలభించిన మారాజున కానందముగల్గు.

అందఱు—(ఎత్తుకొనిపోదురు.)

[పునః ప్ర: ముక్తావళి-ప్రవాళ-నీలాలక.]

ముక్తా—(చూచిభీతిల్లి) అయ్యో! ఆమోహనాంగు నింకెన్నఁడుచూతునే!

(అనుబంధము 5.)

నీలా—ముక్తావళీ! మనభటులు వానినపత్యము సంరక్షింపఁగలరు. యోచింపకుము పోదము. విచారింపకరమ్ము (నిష్క్ర.)

శ్రీ

# ముక్తావళీనాటకము.

## ప్రథమాంకము-చతుర్థరంగము.

### చారువర్మయాస్థానము.

[ప్ర: చారువర్మ-సునీతి-సువిచారుఁడు-సోమశేఖరుఁడు (భుజబద్ధుఁడై) భటులు.]

చారు—సోమశేఖరా! నీచందమంతయు దెలిసెఁగదా? సుబ్రహ్మణ్యుఁడు నున్న యదంతయుమంతయుఁజెప్పె. కనిమసఁగి వెలగెగితిరుగులాడుచు నెట్టివారిన్నగపడుగొనని యనుపంకృతిగల నీవిపుడు మాకు వంటయింటికుంగలవయితివి. మాతాలలముపల్లాని మా కుఁబాలిక కోరిచ్చుచుంటిరి. నాలుగైదు వత్సరములనుండి మీకుపుంకృతియిచ్చె. దానన్నగముఁజేసితిరి. అంతరితత్వము ముఖ్యము గాని ధనము ముఖ్యము గాదను చింతపమేమూరకుంటిమి. రెండువత్సరముల క్రిందట పసముచేసికొంటిరి. దానికని నూరకుంటిమి. ఈవత్సరమునఁ బరమావిధేయతతోఁ గిప్పమేయివ్వమని వ్రాసితిరి. కావాగము హెచ్చె. మా సేనానిమంత్రికుని లోఁజేసికొని రాజ్యమునకే యాపదను సంకేంచితిరి. మాయవేషమొదవ సింగమున్నగుహఁజొచ్చి మాఅంగములల మాయమూరకే యేతెంచితివి. నీమాయకారి బాపనికిని నీకును విధింపఁబడసియున్నది. ఇప్పు డేమందువు?

సోమ—నన్నేలయడుగవలయు! నిమనసునకువచ్చినభంగిఁ జరుపవచ్చును. మీ సేనాని నీకేమియుహానినొనరింపఁడు. వాఁడే మైనసొనర్చియున్నను నాయలన నీకెట్టి మోసమును గలిగియుండెనని కంఠోక్తిగాఁజెప్పవాఁడు. వానిశిక్షించి ప్రయోజనమేమి? నేనన్నను నీచుఁబగవాఁడ. కాలకర్మములు జతగూడినను నియమింపుఁజేసి. నియిచ్చవచ్చినభంగి నొనర్పుము. అయిన నాప్రార్థన మొకటికలదు. నిను వేఁడవచ్చునన్నఁ జెప్పదను. మృతికిఁగొంచెమైనఁజంకని మానవమాత్రుఁ డనన్యసహాయుఁడై యున్నవాఁడు. కోరినకోరకవిని జరుపుకుతూహలము గలదేని నుడివెద.

చారు—నిర్భయముగా వచింపుము.

సోమ—

శా॥ శూరాగ్రేసరుఁడన్ రణేతరమృతిన్ స్రుక్కుంగ నొల్లన్ ధను।
ర్నారాచంబుల ఖడ్గకంకటములన్నాకిచ్చి నీకిష్టమౌ।
వారిన్ నాపయిఁ బంపి యుద్ధమునఁ జంపం బంచి చంపించియో।
వీరస్వర్గముఁ గల్గఁజేయుటకు నేవేనోళ్లఁ బ్రార్థించెదన్ ॥

ఇదియే నాకోరిక. నేశూరుఁడనై శూరాగ్రేసరులని నుతికెక్కిన వంశమున జనించినవాఁడ. ధనుర్బాణముల ఖడ్గవర్మముల నాకిచ్చిన యిచ్చకువచ్చిన యొక్కరితోనైనను బెక్కండ్రతోనైనను బనిసేయించి నన్నుఁ జంపి వీరస్వర్గము ఘటిల్లఁజేయుము. నీవును శూరశ్రేష్ఠుఁడని నుతికెక్కినవాఁడవు. నీశూరతకిది గదా సార్థకము ?

శూర—నీశూరగుణము చాలును. చేఁజిక్కి నిర్బంధితుఁడైయున్న విరోధితో యుద్ధము చేయించుట యీరాజనీతి ? అదిగాక నినుఁ జంపవలయునను నభిలాషము నాకు లేదు. భూభారమేమైనఁ దక్కువగునా ? మృతితప్పించుకొను నుపాయము నీచేనున్నది. నీవై మృత్యువు నెదుర్కొన్న యత్నము లేదు. ఇది నామాట. నేటినుండి పదిసంవత్సరములు మాకు సంగోరుగాఁ గప్పము మాకీవలయు. తరువాతఁ బాతిక భాగముఁ జేసికొనవలయు. మాభృత్యత యొప్పికొని మాకు లిఖితసాధనమిచ్చి యీ భంగి జరుపుటకుత్తరవాదులుగా నీవుగాని మీతండ్రిగాని నైదేడులు మాయధీనమున నిర్బంధనమున నుండవలయు. ఒప్పికొంటివేని జాబు వ్రాయుము. నీ తండ్రిం బిలిపింతును.

సోమ—రాజా ! ఈమాటలాడ నీకు నోరెట్లాడెను ? ధరరణకంకణాంచితుఁడై యుద్ధమే మోక్షసాధనముగను రణరంగమే పరమస్థానముగను ప్రత్యర్థి నిహననమే సర్వైహికాశాపూర్తిగను భావించియున్న నేనాయిందుకు సమ్మతింపవలయు ? ఈమాట వలన నాదేశము కాదు. లోకమంతయు నిలువవలసినను, నింతింతగా నన్నుఁ గోసినను, నాయసువులన్నియు నిల్లోయూడిపడినను, నేనిందుకియ్యకొందునా? నాప్రాణముల వెంతతీపు ! ఆనిటలాక్షుఁడే యీపని చేయుమన్నను జేయదునా ? నేనంత భీరుఁడ ననుకొంటివా ? ఎంతపొరపడితివి ! నాప్రాణములనంత మధురములుగాఁ జూతునని నమ్మితివా ? ఎంతమూఢవిశ్వాసము ? నాముక్కున నావిగలుగ నేనొకనికి దాసుఁడుగానుండ మైకొందునని తలంచితివా ? ఎంతతప్పుఁదలఁచితివి ? అర్థముగాదు, వీసమున వీసమైనను నీకుఁ గప్పము నేనేల యీవలయు ? నాయొకని ప్రాణమునకై తరతరములుగా మావారినీకమ్ముకొనుమంటివా? రేపుచచ్చువాఁడ నేఁడేచచ్చెదఁగాక-నాస్వాతంత్ర్యమను ప్రాణము నీచేఁ జిక్కదు. నన్నుఁ బాసిపోవదు. నీచేఁజిక్కియున్నానని యీ గుర్వాలాపములనీ వాడకుము.

(అనుబంధము [illegible])

ఈ పాపోక్తులనే పరతంత్రుఁడఁగాని వేళ నానిటలాత్తుఁడాడియున్నను, వాని మూడవకన్ను మూయించుచుంటిని. నీయట్టిరాజనిర్భాగ్యుని మాటఁగుంత—

చారు—అధమా! ఇంకనోరుమూయుము. నీపంచయాత్ర్భటులిన్నిఁగను వినినన్ను కుతూహలమునఁగాని యింకొందుపలనఁగాదంతేనటకు నీనమాటలాశేకనిమ్ము. [illegible] నను నీకింకొక్క నెలదినములు గడువిచ్చెద. సేవకులారా! ఆసేనాపతి [illegible] నేఁడే పట్టణమధ్యమున నురిదీయుఁడు. ఆబ్రాహ్మణ చండాలుని సముద్ర [illegible] వింటిని.

కం॥ క్రూరాత్మన్నృశంసునినీ!
జారానుతుఁగొంచునరిగి సౌరాష్ట్రపురిన్ ।
కారాగారము నం దిడి ।
యారూఢిగాఁ జెప్పఁ డనిమేషునకున్ ॥

ఈనీచాత్ముని సౌరాష్ట్రపురమునకుఁగొనిపోయి [illegible] నెలదినములుంచియుండి పిదపఁగొనిరండు. మనుజుని మేషుని [illegible] దల కలిగియుండుమనుఁడు. ఇప్పుడే భూపాలపుత్త్రి [illegible] సేనానికి నియోగముఁగొనిపోండు. (నిష్క్ర[illegible])

శ్రీ

# ముక్తావళీనాటకము.

## ప్రథమాజ్కము-పంచమరంగము.

---

### అంతఃపురము.

---

[ప్ర: ముక్తావళి, చారుహాస.]

ముక్తా— (అనుబంధము 9)

చారుహాసా! ఈకార్యము నీకు సాధ్యముకాదన్న నే నేమనఁగలను? లోకమంతయు, నీపతి నీస్వాధీనమున నున్నవాఁడనియందురే?

చారు—ముక్తావళీ! లోకమంతయు నీవన్నట్లనుట యథార్థమే. ఉండుటయు యథార్థమే. ఐననాయత్నమింతేమియు సాగకున్నది. నయభయగతులనాపతి నుద్బోధించితిని. నాచరణమునపైఁబడి వలదనియె. నే నేమిచేయుదును? అదియుండనీ! మీతండ్రియింత లోననే నిన్ను నాగకేతునకిచ్చి వివాహము చేయవలయునని యున్నాఁడే? ప్రయత్నము లన్నియుఁజరుపుచున్నాఁడే? దీనికెట్లు చేయుదువు?

ముక్తా—అందువలననే నీవు నేఁజెప్పినపనిఁజేయకున్నావా?

చారు—ముక్తావళీ! అందుకుఁగాదు. నీమాటనేజవదాఁటుదాననా? ఈప్రస్తావమున నే నాగకేతునిపై నాకుజ్ఞాపకము వచ్చినందున నడిగితి.

ముక్తా—ఆనాగకేతునిఁనేఁజూచి యే యెఱుఁగఁగదా? మాతండ్రియేమో చెప్పుచున్నాఁడు. నెలదినములలో రానున్నాఁడఁట, ఇంతమాత్రము నేనెఱుఁగుదును. అదియుండనీ. చారుహాసా! నాకొక్కటిచెప్పవలయునని తోఁచుచున్నది. వంచన కార్యమని త్యజింపక చేసెదవా?

చారు—ఎట్టికార్యముగాని శిరసావహించి చేయుదాననని నీమనసెయెఱిఁగియుండ నేఁజెప్పవలయునా?

ముక్తా—కారాగృహము నేమఱక నీపతి కాచియుండ నొకొక్కకవేళ నీవయ్యెడకుఁబోవుటకలదుకదా ? నీవందున్న సమయమున నీపతినిద్రించుటయుఁ గలదుకదా ? అప్పుడుగాని నీపతి భోజనాదులొనర్చు కాలమునఁగాని యేదేనిపరాకునఁ జెఱసాలతలుపుతాళములు నీచేఁజిక్కుట దుస్తరముగాదు. అట్లొదవినపుడు నాని బంధనిముక్తునిఁ జేయుటదుష్కరమా ?

చారు—ముక్తావళీ ! నీవెంతటిముగ్ధవు ? నాపతి కనిమేషుఁడను పేరన్వర్థముగానున్నది. అతనికిఁబరాకుగాని స్వామికార్యమున నిద్రకాని గలుగునా ? అదియట్లున్నను, నూఱురకన్న నెక్కువగానున్న కారాగృహము వెలుపలివాకిలి కావలివారలు వారి నెట్లు మీఱిపోవలయు ? ఇదికానిపని.

ముక్తా—చారుహాసా ! అయిననాభాగ్యమింతయేకదా ?

(అనుబంధము 7.)

చారు—ఊరడిల్లుము. నేనింకనుఁబ్రయత్నించిచూచెద నీ ప్రయత్నమున్నాఁడు.

(నిష్క్ర).

—



# ము క్తా వ ళీ నా ట క ము.

## ద్వితీయాంకము-ప్రథమరంగము.

### దేవాలయము.

---

[ప్ర: బాదరాయణుఁడను యోగి.]

బాద—(జపముఁజేయుచుండును).

[ప్ర: ఒకపురుషుఁడు.]

పురు—యోగిచంద్రా? నీదర్శనమువలనఁ గృతార్థుఁడనైతి.

బాద—నారాయణ! ఏలవచ్చితివి?

పురు—అయ్యో! పండ్రెండుసంవత్సరములనుండి కుక్షిశూలచే బాధపడుచున్నాను.

బాద—భోజనము చేసినవెంటనే కలుగునో?

1 పురు—కాదు—

బాద—మాకుఁదెలియును కొన్నిశూలలన్నము జీర్ణమునకు వచ్చు కాలమునఁగలుగును.

1 పురు—నాకట్లునుఁగాదు.

బాద—అవును నీశూలరెంటికిఁదప్పి తనయిచ్చచొప్పునఁ గలుగును.

1 పురు—భాగ్యము మహామహుఁడవు. నీకుఁదెలియని విషయమేమున్నది? నా కుదయమునఁ గలుగును.

బాద—రేపమావాస్యనాఁడు రమ్ము క్రియఁజెప్పెదను.

1 పురు—అమావాస్యవఱకు నిండేయుందురా?

బాద—నారాయణ!

1 పురు—అయిన నాకు సెలవా?

బాద—కూర్చుండుము. ఈయూర విశేషములేమి?

1 పురు—సర్వవిషయములఁ గరతలామలక ప్రాయముగాఁ గాంచు మీకుఁ దెలియని విశేష మేమున్నది?

బాద—నారాయణ! అయినఁబొమ్ము. (1 పురు. నిష్క్ర.)

[ప్ర॥ 2వ పురుషుఁడును, గ్రుడ్డివాఁడొకఁడును.]

బాద—(చూచియుఁజూడక) కన్నులులేవు. కన్నులులేవు.

2 వ పురు—మహాత్మా! ఈయనతమయొద్ద కొక కార్యమునకై—

బాద—కన్నులులేవు. కన్నులురావు.

గ్రుడ్డి—అయ్యా! నాకన్నులకొఱకుఁ గాదు. అవియెప్పుడో పోయినవి. నాకూతురు సర్వలక్షణసంపన్నయై యుండినను దానిమగఁడు కురూపివేశ్యలలోఁ బడి యాపెను నుపేక్షించుచున్నాఁడు.

బాద—అందుకే కదా మేము. "కన్నులులేవు. కన్నులురావు" అంటిమి.

గ్రుడ్డి—మహాత్మా! అజ్ఞులకు మాకట్టిగూఢాశయములు తెలియఁగలవా? నాయల్లునికిఁ గన్నులు గలుగు నుపాయమైన నేమి?

బాద—కోఁపమావాస్యనాఁడు గమ్ము, చెప్పెదను. ఊరిలో విశేషమేమి?

గ్రుడ్డి—అయ్యా! నాబిడ్డగోడే విశేషము.

బాద—ఇంకఁజాలుపో. నారాయణ!

2 పురు } (నిష్క్ర.)
గ్రుడ్డి }

[ప్ర॥ చారుహాస-వీరబాహులు.]

చారు—స్వామీ! ఈతఁడు నాతమ్ముఁడు.

బాద—నీవెవరవు?

చారు—నేను రాజునకంత రంగసేవకుఁడై ప్రకృతము కారాగృహం రక్షకుఁడై యున్న యనిమేషుని భార్యను. చారుహాసయను పేరిదానను.

బాద—కూర్చుండుము. ఇతనికేమి?

చారు—నాల్గుసంవత్సరములనుండి యూరక చెవుడు పట్టియున్నది.

బాద—ఆమూలనున్న మూటలోఁ దైలముగలకాచకుప్పెయున్నది ట్లు గొనిరమ్ము.

చారు—(పోవును).

బాద——(గట్టిగా) నీకు మిక్కిలిగాఁ జెవుడుకలదా ?

వీర——నా పేరు వీరబాహుఁడు.

బాద——(నవ్వి) కొంచెమైనను వినరాదా ?

వీర——వాననిలిచినది. కుంచెయెందుకు ?

బాద——ఎక్కువగానున్న దే ?

వీర——మీవంటివారుండనాకేమి తక్కువ ?

(పునః ప్ర॥ చారుహాస, కుప్పెతో.)

బాద——(వీరబాహుని చెవిలోఁబోసి) కొంచెమునిద్రపట్టును పండుకొననిమ్ము.

వీర——(పండుకొనును).

బాద——చారుహాసా ! ఊరిలోనేమివిశేషము ?

చారు——ఎన్నియోవిశేషములు. నేనొక్కటేఁబ్రార్థింపవచ్చియుంటి.

బాద——అదియేమి !

చారు——చిరకాలమునుండి నేను సంతానములేకున్నాను - మీరుమహనీయులు. నాకేదైన నను గ్రహింపవలయు. మీరువచ్చి పది దినములేయయియుండినను మీఖ్యాతి యూరంతయునిండినది-రాజాంతఃపురముననుఁదెలిసినది. మఱచితి. మీయెడకు నేఁడోరేపోయీ రాజుకూతురగు ముక్తావళియొకయర్థము నభిలషించి ప్రచ్ఛన్నముగా రావలెనని యున్నది.

బాద——ఏమికార్యము ?

చారు——ఏమికార్యమోయాయమయే చెప్పఁగలదు. మీరుచెప్పుమన్నఁజెప్పెదను. (చిఱునవ్వునవ్వును).

బాద——దివ్యదృష్టి దర్శించిననాకుఁ దెలియనియర్థమేమున్నది ?

చారు——మీకుఁదెలియనిదేమున్నది ? ఆలోచించితిరిగదా ? అదిగో నవ్వుచున్నారు. అప్పుడేవిదితమయ్యెఁగాఁబోలు. ఇంతపిచ్చిమోహమైన నాయమనేమనవలయు? తానెక్కడఁ; దనతండ్రికాజన్మవిరోధియగు సోమశేఖరుఁడెక్కడ ?

బాద——(ఆశ్చర్యపడి) వాఁడిపుడు చెఱసాలనున్నాఁడుగదా ?

చారు——ఇంక మూడునాల్గుదినములలో మారాజాతనికిచ్చిన నెలదినములు గడవుమీఱును. శిరచ్ఛేదనముకాఁగలదు. వానిరాజ్యమంతయుఁబోయెను. వానితండ్రియు యుద్ధమున మృతిఁజెందెనఁట.

బాద——(కన్నీరునించి) ఏమిచేయవలెను?

చారు—అయ్యో! మీకును గన్నుపడవచ్చునుగదా? ధీరగుణములుగల వారికెవ్వరికైనను? అట్టిమోహముగల యీకన్య నేమనవలయు? నాపై నామెకుఁగోపము?

బాద—అట్లనా? ఏటికి?

చారు—(బాదరాయణుని చెవిలోఁజెప్పును).

బాద—నీమగఁడట్టివాఁడైయున్నపుడు నీవేమిచేసెదవు?

వీర—(లేచును).

బాద—మూఁడుదినములిట్లే యితని కీతైలమువేయుము, సుఖమగును.

చారు—నాకేమియుఁ జెప్పకపోయితిరే?

బాద—సంతానమునకా! సోమవారమావాస్యనాఁడురమ్ము.

చారు
వీర } (నిష్క్రమింతురు.)

[ప్ర: 3-వ పురుషుఁడు. పడుచు.]

బాద—ఈయమరాజు కూతురా?

3 పురు—కాదు. ఈయూరనేయున్న శరభరాజను పేరుగల భట్టువాని కూఁతురు.

బాద—శరభరాజుకూతురైన రాజుకూతురుగాదా?

3 పురు—అయ్యో! నాకుఁదోఁచకపోయె. ఈకన్యకుఁ గొంచెము గ్రహబాధయున్నది.

పడుచు—(తలయూపను బ్రారంభించును).

బాద—(మంత్రములుపఠించి గ్రహమువిడిపించి పంపును).

3 పురు
పడుచు } (నిష్క్రమణము.)

ప్ర॥ ముక్తావళి (మాఱువేషమున) నీలాలక.

ముక్తా—మునీంద్రా! మీపాదయుగము దర్శింపఁగన్యలగలిగె.

బాద—నీవీరాజు కూతురవా?

నీలా—మునీంద్రా! సర్వజ్ఞులరగు మీయెదుట నెంతప్రచ్ఛన్నవేషమున వచ్చిననేమి? దాఁప నేటికీయమయీరాజు కూతురేయగును.

బాద—(యోచించి) ముక్తావళియా యీయమపేరు?

ముక్తా—భాగ్యము.

బాద—తరుణీ! నాకుఁజూడ మోహమే నీరాకకుఁగారణముగానున్నది. నీప్రియుని పేరు సకారాదియా?

ముక్తా—భాగ్యము.

బాద—వాఁడిపుడు కంఠగతప్రాణుఁడైయున్నట్లున్నది.

ముక్తా—భాగ్యము.

బాద—వానికి క్షేమము గలిగింప నీవుచేయు ప్రయత్నములన్నియు నిరర్థకము లయిన ట్లున్నది. అప్పలేనివాని యాటంకమెక్కుడుగానున్నట్లున్నది

నీలా—అప్పలేని వాఁడనఁగాఁ దెలియదయ్యె.

బాద—నాజ్ఞానచక్షువులవలన నంతమాత్రమే తెలియుచున్నది. మీరేయెఱుఁగవలయు.

ముక్తా—దేవా! మీమాటయథార్థము. నీలాలకా అనిమేషుఁడుకదేమే?

నీలా—ఆహా!

బాద—తరుణీ! ఇది నెఱవేఱని కోరికయే? నీకెట్లుపట్టుబడెను?

ముక్తా—మహాత్మా! మీమాటయథార్థము కాకుండునా? ఆపురుషపుంగవుఁడు నాకు మగఁడు కావలదు. నాయభిలాషపూర్తియుఁ గావలదు. నాప్రాప్తమెట్లున్నదో యట్ల వుఁగాక. అధరణీశకుమారుఁడు సోమశేఖరుఁ డనువాఁ డిపుడు కారాగృహమునఁ గ్రూరాత్ముఁడగు మాతండ్రి శాసనమున నుఱిత్రాటికెక్కనున్న మెడతోనున్న వాఁడు. ఎట్లయినఁజేసి యతని నందుండి వెడలించితిరా యంతయేచాలును. అతఁడు ప్రాణవంతుఁడై యున్నాఁడని విన్న నేఁజల్లఁగఁ బ్రాణములవాసెద - ఎట్లైన నను గ్రహింపవలయు. (నమస్కరించును).

బాద—తరుణీ! నీకుధీరమానసమున్నదా?

ముక్తా—దేవా! ధీరమానసమునకు నన్నగ్నిలోనొక యామ ముండుమన్న నుండఁగలను.

బాద—అయినఁ జూడుము. (నీలాలక పైపొడి వేయును).

నీలా—(మూర్ఛిల్లును).

ముక్తా—(భయమున) దేవా! ఇట్లేల?

బాద—తనయా! భయపడకుము. ఇదిసమ్మోహకరణియను మూలికా చూర్ణము. ఎట్టివారిఁగాని యిది రెండుయామములు తెలివిలేకుండఁజేయును. నీతో నేనాడుమాటలు నీసఖివినరాదని యిట్లొనర్చితి. నీవునాకుఁగూతురవు-అందుఁబోయి కూర్చుండుమురమ్మ. మాటలాడుదము. అమ్మరో! ఏలయోచించెదు? నీచెలికిఁ గావలెనన్న నిప్పుడే తెలివివచ్చునట్లునుఁజేయఁగలను. పోదమురమ్మ.

(నిష్క్ర.)

శ్రీ

# ముక్తావళీనాటకము.

## ద్వితీయాఙ్కము-ద్వితీయరంగము.

### కారాగృహము.

---

[ప్ర: లోపల సోమశేఖరుఁడు-వెలుపల అనిమేషుఁడు.]

సోమ—ఆహా! ఇట్టినిర్భాగ్యుఁడెందైనఁగలఁడే? ఈచారువర్మపంతకుఁ డిట్టిదుష్కృత్యము సేయఁబాల్పడునే? నాకార్యమున నాతండ్రి ప్రాణములఁగోలుపోయె. నేనే గపురదీయఁబడుచున్నాను. నాకేలయీముష్కరము? ఈచారువర్మ చెప్పినభంగి నాచరించి పట్టణమునకుఁబోయి రేపేయుద్ధమునకు వెడలివచ్చి వీనిజయింపఁజాలనా? ఇకఁ జేయరాదు? ఆహా! నాకెట్టిభ్రాంతిగలిగె? ఇట్లుయోచించుచున్నాను? నాప్రాణములకై నేనింతదురటిల్లవలయు? నను ముద్దుచేసి పెంచిన తండ్రిలేకయున్న యాపాపాత్మునారకి నూరకయే నిర్బంధములేక యీచారువర్మపంపినను నేఁబోవఁజాలఁగదా? ఇట్లుండ నీ దురాత్మునికిఁ బత్రమువ్రాసియిచ్చి నేఁబోవుదునా? అవశ్యము సంతుష్టుఁడనయ్యెదఁ గాక. అయిననొకటిమాత్రము నే నోచనైతిని. సింగముకాటున బెండువడియుండిన నన్నానాఁడాదరించిన యారమణీమణి నాశ్లేషింపలేకుండినను, ముద్దాడఁజాలకుండినను జూడనైనఁ బ్రాప్తిలేకున్నదికదా? నిశ్శంకముగఁ జావనున్న నాకుద్ధవ మిక్కిలి వగఁ గలిగించె. ఆనాఁడా తరుణీమణి సాభిలాషముగ నన్నుఁజూచినచూపు నాకన్నులకుఁ గట్టినట్లేయున్నదిగదా? ఆముద్దుమోము మఱచితి. ఆబటువుగుబ్బలచాయ మఱచితి. ఆసోగకన్నులమఱచితి. ఆబంగరురూపము రేఖమఱచితి. ఆకోమలహస్తములమఱచితి. ఆచేతుల నాయొడలు నిమిరినపుడు నాకుఁగలిగిన యానందము మఱచితి. మఱచితి, మఱవకున్నను మఱవఁగలను. కాని యాప్రేమముడించు చూపుమఱువఁజాల. ముక్తావళీ! నాకింతయే భాగ్యముసుమా!

(అనుబంధము ౧)

పరమపదవాసా, నినునమ్మియున్నవాఁడ. ఎట్టివేళనయినను నినుమఱవనివాఁడ. అహంకృతివేళమునవిచ్చలవిడిముందు వెనుకలరయక శాత్రవుని యూరికసహాయుండనైవచ్చిన నాసాహసమునకీ విధితగినదే. సర్వసముఁడవై భక్తజనక్షేమంకరుఁడవై

శ్రితాళికాపదలఁబాపు నీవునాకాపదగలిగింతువా ? నామేలు కోఱకిట్టి పాటునాకుఁ గల్పించితివిగాక సభక్తితాత్పర్యమున నేనిది నమ్మఁగలవాఁడ. ఇఁకఁగొన్ని దినములు మనియున్న నాపూర్వపాప ఫలములనే నింకేమనుభవింపనుంటినో ? అవియన్నియుఁ బాపినను నీసన్నిధికిఁగొన నెంచు టనుగ్రహముగాక నిగ్రహమేలగు ? దేవా ! శ్రీపుద యమున నిరాయాసముగనను నీసరసకుఁగొమ్ము. మాముక్తావళిని రక్షింపుము. ఆచె లువకు సర్వైహికసౌఖ్యముల నొసఁగుము. పరమేశా ! ఇదేనమస్కరించువాఁడ.

సీ॥ సకలైహికానంత సౌఖ్యంబు లొసఁగునా
కేనారియవిరత ధ్యానమహిమ ।
యననుభూతాతి లోకానందము ఘటించు
నేనాతిరుచిరాభిధానగరిమ ।
నాకలోకామితాస్తోక సంపదలిచ్చు
నేభామసన్నికర్షాభిలాష ।
విగతాచరణలోక విస్మృతిఁగలిఁగించు
నేలేమకడగంటి వాలుచూపు ॥

తే॥ గీ॥ అట్టిముక్తావళి దశనాళివిజిత ।
సురుచిముక్తావళికి సర్వశుభమొసంగి ।
చెలఁగిపాలింపుమయ్య రక్షింపుమయ్య ।
దివ్యవిజ్ఞానభావయో దేవ దేవ ॥

అనిమేష—(ఇంతవఱకూరకయే లేచిచూచుచు "ఎవరది" యనుచుతాళము చేతులఁబట్టి చూచుకొనుచు తలయూచుకొనుచుండి నిద్రించును.

(ప్ర॥ బాదరాయణ. ముక్తావళి. పురుషవేషమున)

అని—(లేచి). ఎవరక్కడ ? ఎవరక్కడ ?

ముక్తా—నేను. (అనిచూర్ణము వేయును).

అని—(మూర్ఛిల్లును.)

బాద—(అనిమేషుని మొలనున్న బీగము చేతులవిడుచుకొని కారాగృహమువాకిలి తెఱచి లోనికిఁబోవును).

సోమ—(లేచి) ఎవరక్కడ ?

బాద—సోమశేఖరా ! లెమ్ము. పోదమురమ్ము.

సోమ—నీ వెవ్వరవు ?

బాద—సోమశేఖరా! నీపినతండ్రిని మీననాథునిం గుఱుతెఱుంగవా ?

సోమ—దురాత్మా, నను మోసము చేయంజూచెదవా ? నాపినతండ్రి మీననాథుండట్టివేళ నియ్యెడ కెటువచ్చును ? ననుంజంపవచ్చియుండిన నీవంచనయేల ?

మీన—కుమారా! నినుం జూడ సంతాపము గలుగుంగదా ? ప్రతిపక్షధరణీపాలక దంతావళీకేసరికిశోరనికాశుండవై యెదురెందులేని కడిమిందిరుగు నీ కాయిట్టిపాటు ?

సోమ—(స్వ) ధ్వనియట్లేయున్నది. పితృవ్యా! వచింపుమిదియేమి స్వప్నమా లేక నిక్కువమా ?

బాద—కుమారా! నమ్ముము. నేనే మీననాథుండను.

సోమ—పినతండ్రీ! మన్నింపుము. ఈచారుశర్మవంచకుండు నాతోనగ్నియున్న యుపమతివలన మోసమంతయుం బొడవుగాంచినను జుట్టుకొన్నట్టులుండుటచే నాకన్నుల నేనమ్మంజాలకున్నాను. వచింపుము, నీ వెట్లువచ్చితివి?

మీన—మాటలకవకాశము లేదు. నినువిడిపింప యతివేషము దాల్చి వచ్చితి లెమ్ము వెడలిపొమ్ము.

సోమ—ఆహా! నాభాగ్యము సమానము. ఇదే సచ్చితి. (బట్టలు మున్నట్లు సవరించి కట్టుకొని కూరుచుండి) పితృవ్యా నాతప్పు మన్నింపుము. నేనిక్కడనుండం గోరెదను.

మీన—అయ్యో! ఇదియేమి భ్రాంతి! ఈపనినన్న గనియుట నీరాజ్యచంద్రాలుం డొక్కాపించియున్నాండే? సిరికి మోకాలొడ్డినభంగి సంపదకు నీవుచూపినభంగిం జేసెదవేల ?

సోమ—పితృవ్యా!

ఉ॥ తోఁచకపోయె నామదికి దోసము నాకు క్షమియింపుమయ్య నే।
కీచియుబుద్ధియిప్పు డుదయింపంగ నోలనిసల్కకయ్య నే।
నోచితినయ్య నోములు మనోగతి నియ్యెడంజూపంగాన నే।
నీచెఱంబాయనయ్య వెలికేగంగంజాలంగదయ్య వింటివే॥

ఈలోకమంతయు నెంతనశ్వరమని తెలిసియుండినను జనులెందుకిందు బ్రదికియుండనే కోరుదురు? పదార్థప్రీతిచేతనే కదా? నాకుం బ్రియమగుపదార్థ మీలోకమున నొకటితప్ప వేఱులేదు. అదియిచ్చోటనేయున్నది. నాభాగ్యమును నాయైశ్వర్యమును నాప్రాణమును నాకుంగలయన్నియు నాపదార్థమే. కావున నిచ్చోటనుండి పోవంజాలను. ఆపదార్థముగల యీచోట మృతిం బొందినను నదియే ధన్యత. అయ్యదియే కృతార్థత? అల్లదియే సర్వాశాపరిపూర్తి.

మీన—తనయా! అదియేమి పదార్థమయ్యా?

సోమ—చిన్నతండ్రీ! ఇంకదాఁచఁజాలను. నామనసును హరించినదియు, నన్నుఁదనలోని భాగముగను దన్ను నాలోని విశేషభాగముగను జేసినదియుఁ, దన్ను మానిన నీలోకమే నాకులేదనిపించునదియుఁ, దలంచినమాత్రమున నేయిట్టిమరణమువేళను నాకధిక ధైర్యమును, సమధికోత్సాహమును, బరమానందమును, నమితభాగ్యమును గలిగించునదియు, స్థలాంతర సాగర్వభౌమ పదవికంటెనే తత్కారాగృహ మరణమే నాకుమేలనిపించునదియు, నగుపదార్థము చెప్పుదునా? తలఁచినప్పుడే కన్నులకానందబాష్పములును గంతమునశోక గాద్గద్యమును మనసున నేనెక్కడనేనెక్కడ యని పోరాడు శోకసంతోషములును గలుగుచున్నవి. కావున వచించెదను. ఆపదార్థము నాలుగక్షరములఁ బరిపూర్ణదశఁజెందియున్నది. ఈరాజునకుఁగూతురై ముక్తావళియను పేర.

## (అనుబంధము 7.)

ముక్తా—(పురుషవేషముతీసి పాఱవైచి లోనికిఁబోయి) హా! నాథా! నేధన్యను నేధన్యను. నేనునీకింత సంతాపమును సంతోషమును గలిగించితినంటివి. నను శిక్షించినను మన్నించినను నీదాననే. (ఆలింగనము.)

## (అనుబంధము 8.)

సోమ—స్వప్నముకాదుఁగదా! స్వప్నముకాదుఁగదా?

మీన—(స్వ) సుముహూర్తోస్తు. (ప్ర) కుమారా! ఇదియే ముక్తావళి. మీరిరువురు వెడలిపొండు. తడవగును.

సోమ—మేము వెడలిపోయిననీవు—

మీన—దీర్ఘసంవాదమున కవకాశములేదు. నేనిదేయతివేషమున నీపురమువారి నావారిఁగాఁజేసికొని, యీముక్తావళి విశ్వాసమునడపి యీతనయసహాయ మొనరింప నింత కార్యముఁజేసితి. ఈకుమారి తనయయ్య ముద్రాంగుళీయకముఁదెచ్చినందుననీగృహము వెలుపలికావలివారి మోసపఱచి లోనికివచ్చితిమి. నేనెఱిఁగిన సమ్మార్జకరణివలన యనిమేషుని నిద్రపుచ్చితిమి. వచ్చినవారమిరువురమవుటచే మువ్వురము వెలుపలికిఁబోయితిమా వెలుపలికావలివారు సంశయింతురు. వ్యర్థప్రయాసమగును. ఈకారాగృహమువెనుక నే పాఱుచున్న తపతీనదముదాఁటి యావలఁజేరువఱకు మీకు క్షేమము కలుగదు. అనదియొడ్డుననే యొకతెప్ప సిద్ధపఱచియున్నారము. ఈముక్తావళి చూపఁగలదు. నేనిందేయుండెదను. యతినగుటచే మహాత్మ్యము ప్రకటించితినని చెప్పితే పెట్లయినఁదప్పించుకొందును. అదిగాక నన్నెఱింగినవారొక్కరు నిందులేరు. నాకు దండనమొసంగుటకుఁ గారణమునుండదు. లేక నిర్బంధముననే యుంచియుండిరా నీవు సేనాసముపేతుఁడవైవచ్చినను విడుపింపఁజాలవా? అట్లుగాకొకవేళ ననువధించినను నీవొకఁడవు గట్టిగానున్న నాకంతయేచాలును.

సోమ—పితృవ్యా! ఇదియేమియుక్తి? ఆకాపాలివాండ్రకే యింతచింతింపవలయునా! ఒక ఖడ్గము నా చేనున్నం జాలదా? మనము ముప్పురముం బోదము.

శా॥ ఆలంభప్రళయప్రయత్నపటు నృత్యద్భీమకంఠాచర ।
త్కాలాహీశ్వరభోగభీషణము తత్కాల్యాంతదావానల।
జ్వాలాసన్నిభ ముగ్రశూలయమపాశప్రాయమీఖడ్గమీ ।
కేలంగ్రాలఁగ సైన్యసంహననము న్గేళీగతిం జేయ నే॥

మన—చిఱుతవాఁడ వెఱుఁగకిట్లాడెదవు. ఆకాపాలివారు నూర్గురకెక్కువగానున్నారు. హతశేషుఁడొక్కఁడెవఁడైన రాజున కీవార్తఁ జెప్పిన మనము నదిదాఁటుట కనువగునా? ఇంకింతసేపటికీయనిమేషుఁడు లేచి యిందొక్కరు లేకుండుటఁ జూచెనా, యదియుం గార్యవైఫల్యమునకుఁ గారణమే. ఇదియంతయు ముక్తావళితోఁ జెప్పి సమ్మతిపఱచియున్నాను. ఉదయమగుటకు ముందే నదీతరణముమాత్ర మొనరింపవలెను. ఈయమావాస్యాంధకారమును ఈచిటిపొటి చినుకులును మాకనుకూలము.

సోమ—పితృవ్యా!

మ॥ కరవాలంబునఁ గోయనిమ్మొసఁగుదుం గంఠంబు నేభంగిదు ।
ర్మరణంబైన సహింతుఁగాక త్రిజగన్మాన్యున్మహోదారుని ।
న్బరిబంధంబుననుంచి నేఁబడయు నాస్వర్గంబు నేనొల్లని।
త్యరసాలంబులె యంతతీపులె పితృవ్యా నాదుప్రాణంబులున్॥

అట్టి మహోదారతిలకునిఁ జెఱనుంచి నేఁబడయు బంధమోచనము నాకొల్ల. ఆ వైకుంఠపదవియేయబ్బినను నేనొల్ల. నీప్రాణమునకంటె నాప్రాణమంతయెక్కువయా?

మీన—నీవింకమాటాడిన నాయానగలదు. నీవిక్కడనుండి పోవకుంటివేని నేనాలుకఁ ద్రెంచుకొని యసువులంబాసెద.

ముక్తా—అంతయేల? మీరిరువురునుబొండు నేనిందుండెద. మాతండ్రి నన్నేమిచేయును?

మీన—మరలమరల నీమాటలేల? మీరింకఁ బ్రత్యుత్తరమిచ్చెదరేని నాయానగలదు.

సోమ—హా! దైవమా? నీయానయని యిట్టులాన వెట్టిన నేనేమి చేయఁగలను?

మీన—అదిగో! అనిమేషుఁడు కదలుచున్నాఁడు. ఇందుండకుఁడు పొండు, పొండు, పొండు.

సోమ—(బిగము వేసి తాళము చేతు లనిమేషుని మొలలోఁ గట్టి) పితృవ్యా! నీయుపకార మిట్టిదని నే నెంతునా? నీయానకు వెఱతుఁగాక, యిట్టిలోకాతీత ధీరోదారు నిన్ను చెఱనుంచి నేఁబోననాకుఁ గాళ్ళాడవు. నాకించుకయు సంతసముచాలదు, ఇదే

ఘోరప్రతిజ్ఞ చేయువాఁడను. నాయసువులు నా మేనమాత్రముండెనా నిన్ను నిర్బంధము నుండి విడిపించుటయే వేదవిహితకార్యముగను గురుదేవులయాజ్ఞగను భావించెదను. ఇందుకుఁదప్పిన నేదైవమునకు మాతాపితృలకుఁ దప్పినవాఁడనగుదు. ఇదెనమస్కరింతును.

ముక్తా—జనకా! ఇంచుకైనఁ గరుణయెఱుఁగని జనకుఁడు నాకుండియు లేకుండు నట్లయ్యె. కావున దుఃఖసాగరమునుండి నను వెడలింపను, నాసర్వాభీష్టములు సమకూర్పను, గలిగిననీవే నాజనకుఁడవు. నానాథుఁడొనర్చిన యీప్రతినవెల్లపుడు స్మరణకుఁ దెచ్చుచుండఁగలదానను.

సీ॥ శరణాగతత్రాణ కరుణాకరవిధాన
జ్ఞానక్రియాబోధమీననాథ।
ఈధరాతలమున నీధీరచరితంబు
వర్ణింపశక్తులెవ్వారుగలరు।
అమ్మమ్మ యెన్ని జన్మమ్ములెత్తిననైన
నీఋణంబునుఁదీర్ప నేరఁగాదె।
ఇదె నేఁడుప్రతినవట్టెదనిన్ను నానాథుఁ
డింతకావఁగ వచ్చునంతవఱకు।

తే॥గీ॥ నీయుదంతంబునుడువుటఁ బాయసుమ్ము।
ఇంకఁబలికిని నిద్రరానీనుసుమ్ము।
పూని నేనేకభుక్తంబుమానసుమ్ము।
అంతవఱకీధవునిఁ బెండ్లియాడసుమ్ము॥

నినువిడిపించు ప్రయత్నమతఁడొనరించి నీ కేదుఃఖములేకుండఁ జేయువఱకు నేనతనిఁ బరిణయమాడుదానఁగానని నేనిదె నీపాదములానఁ బ్రతినయొనరింతు. నాథా! ఇది నీకును సమ్మతమేకదా ?

సోమ—పరమభద్రము. పిత్రవ్యా! మాయిరువురిప్రతిజ్ఞల జరుపువారము.

(ముక్తా: తోనిష్క్ర.)

అని—(లేచి నలుదిక్కులు మాచి లోపలగురకవెట్టుచున్న వానిన్దిలకించి తలయూఁచి బీగము చేతులఁబట్టిమాచి పండుకొనును.)

(యవనికదిగజాఱును.)

శ్రీ

# ముక్తావళీ నాటకము.



## ద్వితీయాఙ్కము. తృతీయరంగము.



తపతీనదీతీరము.



[ప్ర: ముక్తావళి-సోమశేఖరులు. (తెప్పపై)]

(అనుబంధము 9.)

ముక్తా—హా! నాథా! చూచితివే యెట్లుమహోన్నతముగా సముద్రోదయమున్న దీ ప్రవాహము ? నాకు భయముగలిగె.

సోమ—ముక్తావళీ ! భీతిల్లకుము. దైవముమనకంత దుఃఖముఁగలిగింపఁడు. ఈశానవాతమిచే నీయేట నిప్పుడేపైనీరు వచ్చుచుండుటఁగొట్టుకొనిపోవుచున్నారము, కాని తెప్ప బలిష్ఠమైనట్టున్నది. భయంపడకుము.

ముక్తా—నాథా ! దాపునసముద్రముగలదే ? అందుఁ బోయిన నేమిచేయువారము ?

సోమ—అయిన నేమాయె ? భీతిల్లకుము?

ముక్తా } (పోవుచు సముద్రమునఁబడియెదరు. తెప్పరెండు భాగములైపోవును. ముక్తా
సోమ } వళీ సోమసేఖరులు చెరియొక భాగమున వేఱైపోయెదరు.)

(యవనికదిగజారును.)



శ్రీ

# ముక్తావళీనాటకము.

## ద్వితీయాఙ్కము-తురీయరంగము.

### కారాగృహము.

(లోపల మీననాథుఁడు పండుకొని యుండును.
వెలుపల ననిమేషుఁడు కావలి)

[ప్ర: చారువర్మ-నాగకేతుఁడు-సైనికులు-మంత్రులు-
సునీతి-సువిచారుఁడు.]

చారు—(అనిమేషునితో వాకిలితీయించి) దురాత్మా! మూర్ఖాధమా! లెమ్ము. ఇదే నిన్నురిదీయువారు సిద్ధముగా నున్నారు. కడమాట నేనే నీతో వచింపవచ్చితి. మీపట్టణము రాజ్యమంతయు మా యాధీనమయ్యె. మీతండ్రియో సంహరింపఁబడియె. ఊరకమూర్ఖమున నేటికిఁ బ్రాణములనొప్పఁజెప్పెదవు? ఇప్పుడైనను నాయాజ్ఞ జరుపుదు వేని నీరాజ్యము నీ కిచ్చెద.

మీన—(ముసుఁగుతోనే నవ్వును.)

చారు—నవ్వెదవా? ఏడ్చెదవా? నీకేమి కాపరమా? ముసుఁగేలతీయవు? ఈముసుఁగుకారమున నేమిఫలము?

సైని—(మీననాథుని ముసుఁగుందీయుదురు.)

మీన—నారాయణ! నారాయణ! ఏమిది? నేనెవ్వఁడు, మీరెవ్వరు? ఇదేచోటు?

అందఱు—(ఆశ్చర్యము నభినయింతురు.)

చారు—అనిమేషా! ఇదియేమి?

అని—ప్రభువా! ఇందు నాయపరాధమింతైనను లేదు. అగ్నిపట్టి ప్రమాణముఁజేయుమన్నఁజేయుదును.

చారు—సైనికులారా! మీరు వెలుపలనుంటిరిగదా? మీకుఁదెలియక నీకార్యము జరుగునా? ఇదియేమి?

సైని—(స్వ) ముద్రయుంగరము వృత్తాంతముఁజెప్పితిమా మాప్రాణముపై నేమిసచ్చునో? (ప్ర) దేవా! ఇట్టి యాశ్చర్యము మేమెందు నెఱుఁగము. నేఁడేసోము శేఖరు నురదీయుదురుగదా! ఇంతలో నేమిసంభవించునోయను భయమున నూట యేబురును నిన్నరాత్రి నిద్రలేక మేల్కొని యుంటిమి. వెలుపటికొక్కరును రాలేదు.

చారు—అయినవీఁడెవఁడు?

సునీతి—రాజేంద్రా! ఈతఁడీపదిదినములనుండి మనయూర నేయున్న యతీంద్రుఁడు మహాత్ముఁడని జనులందఱు చెప్పఁగావిన్నాను.

చారు—ఏమాశ్చర్యమిది? సన్యాసీ! నీవెట్టికపట సన్యాసివి? ఎక్కడఁ కట్టువచ్చితివి? నిక్కముఁజెప్పకున్న నినుఖండింతును.

మీన—(ఇంతవఱకు "నారాయణ" యనుచుండి) అహా! నేనా? ఎక్కడనుండి వచ్చితినా? ఆహాహా!

చారు—ఈదురాత్ముఁడీ హానిని విడపించుటకుఁగారణము. అన్నమా! చెప్పుదువా? చంపుదునా?

మీన—అహా! అహా! నన్నా! చంపుదువా? (నవ్వి) ఎవఁడు?

అని—నేను. (అనిసమీపించి ఖడ్గమెత్తును.)

మీన—(మన్నుగోనిచేతనుంచి—అని: ముగము పైనూఁగును.)

అని—(మూర్ఛిల్లును.)

మీన—ఇంకెవరువచ్చెదరోరండు!

(అందఱు నాశ్చర్యము నభినయింతురు.)

చారు—దురాత్మా! నిన్నూరక విడుతునని యుంచితివా? నిన్నింతింత గాఁగోసవేయింతును.

మీన—ఊఁ—కానిమ్ము.

(అనుబంధము 10)

చారు—(స్వ) వీనినేమిచేయవలయు? నాకేమియుఁదోఁచకున్నది. (ప్ర) నీవునిక్కంపుయతివో కైతవయతివో యాదైవమెఱుఁగు. ఎట్టువచ్చితివిందు?

మీన—రాజా! నీకూరక దుఃఖమేల ? నేను గపటయతినని యేయనుకొనుము. దాననేమి యునాకుఁగొదువలేదు. నేనువచ్చి మంచిరాజ్యమని యీయూరఁదపముఁజేయు చుండఁగా నూరివారందఱు నన్నూరక బాధించి వరములడుగుచువచ్చిరి. కపటయతి నైనందున వందఱిని నమావాస్యనాఁడు రమ్మంటిని. అమావాస్య నిన్నగదా ? నాగురువునాపైఁ గోపముగలిగి విసరవైచెను. ఎక్కడఁబడితినో యెఱుఁగను. ఇప్పుడు కారాగృహమని తెలిసెను. ఈచోట నెవ్వఁడో యొకసుకుమారుఁడున్నట్లుండెను. నేను పడినవెంటనే మిద్దెపూఁటుపొడుచుకొని పోయినట్లాయెను. వాఁడెవఁడో యెక్కడికిఁ బోయెనో యెఱుఁగను.

చారు—సైనికులారా ! ఈపలువమృషాలాపము లాడుచున్నాఁడు. వీనిఁబట్టి ఖండలు ఖండలుగా నొనరింపుఁడు.

(సైనికులు వెనుకకుఁద్రొక్కుదురు.)

చారు—దురాత్ములారా ! వెనుదీసెదరా ? మీపనిచక్కఁజేయఁగలను. పనిపని నేన చేసెదను. (కొట్టును.)

మీన—అయ్యో ! నాబిడ్డయేమాయె. నాబిడ్డయేమాయె ? హా హా హా

చారు—పలుగాకీ ! నీబిడ్డయెవరు ? నీవుసన్యాసివైన నీకుబిడ్డయెక్కడవచ్చె ?

మీన—బిడ్డయా! హా హా హా. నాబిడ్డ. ఎంతముద్దుబిడ్డ ? పోయె. పోయె. హా హా హా.

(ప్ర: శీఘ్రగమనముగ నీలాలక)

నీలా—దేవా ! నాయభ్యంతరము క్షమింపవలయు. నిన్నరాత్రి యర్ధరాత్రివఱకు మేము ముక్తావళియు మాటలాడుచుఁ బండుకొంటిమి. కొంతసేపులోననే ముక్తావళి వెలుపటికిఁబోయెను. నేనువత్తునన్నవలదనియె. తర్వాతనాకన్నె నిద్రవచ్చె. ఉదయమగుటకు జామున్నప్పుడే లేచితిని. ముక్తావళి కానరాకున్న వెదకితిమి.

కం॥ ఆయర్ధరాత్రినుండి యు।
యో యెల్లెడవెదకితిమి తలోదరి నదియే ।
మాయయె కనఁబడకున్నది ।
మాయపరాధంబులేదు మానవపాలా ॥

ప్రవాళవల్లియు వెదకె. ఎందెందు వెదకినను జిక్కకున్నది. మహీశా! మన్నింపవలయు.

చారు—హా ! హా ! హా ! దైవమా ! (మూర్ఛిల్లును.)

నాగ—హా! శ్రీహరీ!

మీన—నాబిడ్డపోయె. నాబిడ్డపోయె. హ్హా హ్హా హ్హా

చారు—(లేచి) నాగకేతూ! నాబంగారపు కూతురునాకుఁ దక్కునా?

(అనుబంధము 11.)

నాగ—అయ్యో! కాంతామణీ! ముక్తావళీ! నీవునాకు భార్యవై సర్వసుఖములొసంగఁ గలవని నమ్మియుంటినే? నాచిత్రకారశక్తివలన నీరూపముఁజూచుచుండినను ప్రశంస వలనవిని రూపమెట్టిదిగా నుండఁగలదని యెన్నియోచిత్రములవ్రాసి పేరొసఁగిచేసి నిన్నుఁజూడ నెంచితినే? ఇంకనొక గడియకు నీమంగళాంగదర్శనము నాకులభించు ననియుబ్బుట్లూఁగుచుంటినే? ఇంతాశాభంగముఁగలిగించితివా?

మీన—నాబిడ్డ. నాబిడ్డపోయె. హ్హా హ్హా హ్హా.

చారు—నీలాలకా పోదమురమ్మ. సైనికులారా! మీరందఱుపోయి దిక్కు దిక్కుల నా కుమారిని వెదకిరండు.

(నిష్క్ర.)

(అనుబంధము 12.)

నాగ—దైవమా! నాకేమిప్రాప్తిగలిగె? ఆ ముక్తావళి లేకున్న నేనెట్లునిర్వహించుకొందును? భూమియంతయుసైనఁదిరిగి దానిపాలకుని గుఱుతింతు, నొండెనిట్టినే మార్గము నొందుదుగాని యాతరుణీమణిలేక నేజీవింపఁజాల.

(నిష్క్ర.)

[ప్ర: సైనికుఁడు.]

సైని—యతివర్యా! నమస్కరింతును. మాచారుదత్తరాజుగారు మీకవశ్యంబువిఘ్నము లై క్షమాపణముఁ జెప్పుకొనుచుఁ గనుగృహాముసకు మిమ్ము విజయముచేయించుకొని రమ్మనినారు. పల్లకివచ్చియున్నది. వేంచేయుఁడు.

మీన—నేనిప్పుడు రానని వానితోఁ జెప్పుము. ఊరిలోనికిఁ బోయి పిదప నిష్టమువచ్చి నప్పుడు వచ్చెదనని చెప్పుము. (నవ్వుచు లేచిపోవును.)

అని—(లేచి చూచి) హా! హా! ఏమాశ్చర్యము. (నిష్క్ర.)

---

శ్రీ

# ముక్తావళీ నాటకము.

## తృతీయాఙ్కము-ప్రథమరంగము.

### కేరళరాజ్యమున సముద్రప్రాంతభూమి.

[కొందఱు తురకలు మాటలాడు కొనుచుండ ప్రవేశము ముక్తావళి.]

ముక్తా—మహాత్ములారా! అనదనై గత్యంతరములేక వచ్చియున్నాను. మీరెవరైనఁ గాపాడవలయు.

తురకలు—(తమమాటలతో హాస్యమాడెదరు.)

ముక్తా—అయ్యలారా! మీమాటలు నాకేమియుఁ దెలియవు. చూడఁగా నను మేలములాడునట్లున్నది. ఇదిధర్మమా?

తురక—(ముక్తావళిపైఁబడఁబోయెదరు.)
ముక్తా—(చూర్ణము వారిపైఁజల్లును.)
తురకలు—(మూర్ఛిల్లెదరు.)

ముక్తా—దురాత్ములారా! ఇట్లనేపొండు. దైవమా! నేనింకేమిసేయుదును. నానాథుని యాశ్లేషసుఖమొక్క సారికేకడ గావలయునా? తపతీనదము దాఁటి యేతెంచిన నాకనంతసౌఖ్యము కలిగెనని నమ్మియుంటిఁగదా? ఆనదము వేగమున సముద్రమున రెండు క్రోశములు గొట్టుకొని పోవలయునా? పోయినను మానెఁగాక నానాథునితోనుండినదియే పరమానందముగనుండెనే? అదియులేకపోయె. దక్షిణమునకు నన్నును బశ్చిమమునకు నానాథునిఁద్రోయవలయునా? అప్పుడయ్యెడకు వచ్చుచుండిన యోడ బేహారియొకఁడు చోళరాజ్యమునకుఁ బోవువాఁడు నన్నుఁదనయోడ నెక్కించుకొని వచ్చుచుండినవాఁడు దారిలోనిందే తనయోడతోఁగూడ మునుఁగవలయునా?

(అనుబంధము 13.)

హతభాగ్యురాలనగు నాకొక్కతెకుమాత్రము మృతిగలుగకుండ వలయునా? ఈరూపమున నే నెక్కడికిఁబోయినను భంగపాటుగలుగుఁగాక వేఱుగాదు. (తన

-చీరఁ జూచి) నినుఁ గట్టినవారిఁ గలకాల మబలలఁగాఁ బరతంత్రురాండ్రఁగాఁ జేసి గొప్పరికలలను భంగపాటు గలిగించి హాస్యమునకు నిడుమలకుఁ బాత్రభూతలుగాఁ జేయు వస్త్రమా! నీవిట్టిపొమ్ము. (పాఱవేసి) రూపములలనఁ గొనిన వేషమువలననైన నే బురుషుఁడనయ్యెద. (పురుషవేషము ధరించి) ఇంకనన్నెవ్వరేమి చేయఁగలరు? నే నా నాథుని ప్రథమాలింగనము వడయఁగోరి గురుఘనస్తనభారాగ్రభాగ్యప్రాంతమున కరుగుటకే వేషము ధరించితినో యదియే యిప్పుడు నాపాలికి లభించినది. ఆహా! లోకమున వేషమున నెంతయున్నది? అప్పుడే నాకు మగతనము లభించినట్లు ధీరత్వమంతయుఁ గొఱవడుచు నచ్చె. ఒక ఖడ్గము మాత్రమున నే యుద్ధమునకుఁ బోవుదానివలెనున్నాను. "పోవుదానివలె" నేల? "పోవువానివలె" ననుము. వేషము వేసికొనినవారి బ్రదుకు నిరర్థకము. ఈ వేషముననే యుంటినా, యీ తనుగకలసముల్లసమున గుర్తింపఁబడుదునేమో? ముందు పోయెదను. నేనొక్కటి కానలయుఁగదా? నీలకేశములను సిగఁజెట్టుకొనియెదను. ఎందైనఁ బోయి రాజానొప్పు నూడిగమునను వినోదు నా నాథుని జాడ నన్వేషించెదను.

(నిష్క్ర.)

శ్రీ

# ముక్తావళీనాటకము.



## తృతీయాఙ్కము-ద్వితీయరంగము.

### కేరళదేశములోని వీధి.

---

[ప్ర: చారుఁడు.]

చారుఁడు—జనులారా! బ్రహ్మక్షత్రియ శూద్రవతంసములారా! వినుండు వినుండు. ఈకేరళరాజ్యమున నొక వనకుంజరము, అప్పుడప్పుడు రాత్రివేళఁబట్టణములకుఁబల్లెలకువచ్చి యిండ్లను జనులను వనములను నాశనముఁజేయుచుండుట యందఱు నెఱుఁగుదురుగదా? దానివధించుటకుఁ జేయఁబడిన సర్వోపాయములు విఫలములై యుండుటయు నెఱుఁగుదురు. అదిసర్వాయుధాభేద్యమై గజరూపమూనిన మహాసురుని చందమున నెందు నెదురులేకున్నది. నిరపరాధజననాశనమునకుఁ గటకటపడి కేరళరాజ్యరమా విలాసులగు నంగార శర్మరాజుగారు వక్ష్యమాణవిధమునఁ జాటించుచున్నారు. ఎవ్వరైనను శూరులగు వారీకుంజరమును దృష్టాంతయుక్తముగ దిష్టాంతమొనర్చిన మారాజ్యములో మేముపాతిక భాగమివ్వఁగలవారము. వారివంశమున్నంతవఱకు నడుపువారము. అట్టివారు బ్రాహ్మణక్షత్రియులలోఁ జేరినవారేని, శూద్రాగ్రేసరుఁడని జగత్ప్రసిద్ధిఁగనిన వానిఁగాక యితరులఁ బెండ్లియాడనని ప్రతిజ్ఞపట్టియున్న మాయేకపుత్రి నింగులేఖాదేవిని మేమట్టి శూరవరునకుం బరిణయముఁజేసియిచ్చి యర్ధరాజ్యమివ్వఁగలవారము. ఇది త్రికరణశుద్ధిగా జరుపువారము. శూరులకెల్ల మంచి సమయమిదివినుడు. ఉపేక్షయొనరింపరాదు సుమండీ,

(నిష్క్ర-.)

---



# ముక్తావళీనాటకము.

## తృతీయాఙ్కము—తృతీయరంగము.

## పాండ్యరాజగు చతురవర్మయాస్థానము.

[ప్ర: చతురవర్మ—మంత్రి.]

చతు—మంత్రీ! వస్తువాహుఁడిపుడే వచ్చెనా?

[ప్ర: వస్తువాహుఁడు. ముక్తావళి (పురుషవేషముగల)]

వస్తు—పాండ్యధరామండలాధీశా! చతురవర్మరాజేంద్రా! నమస్కరించుచున్నాఁడను. మీయాజ్ఞ తెలియంగనె సింధుదేశమునుండియు ఘూర్జరదేశమునుండియు మీరుకోరిన సర్వపదార్థములఁదెచ్చియున్నాఁడను, బండినుండియిప్పుడే వచ్చితి.

చతు—వస్తువాహా! మిక్కిలి సంతసించితిని. ఈముద్దుకుమారుఁడెవ్వఁడు?

వస్తు—రాజచంద్రా! ఇతఁడు నీలకేతుఁడను రాజపుత్రుఁడు. కేరళదేశపు సముద్రప్రాంతమున నాకుఁజెలికాఁడయ్యెను. మిక్కిలి శాస్త్రపరిచయమును యుద్ధసామర్థ్యమును గలవానిఁగా నెఱిఁగితి. దేశసంచారియైయున్నందున మీయాశ్రమమున నుండఁగలవాఁడని పిలుచుకవచ్చితి.

చతు—కుమారా! నీతలిదండ్రులెవరు?

నీలకేతు—దేవా! నాతలిదండ్రుల నేమనిచెప్పఁగలను?

కం॥ అనఘాత్మ నాయదృష్టం |
బున నదియే జనని యుడసముద్రుఁడె జనకుం |
డను భంగిగలిగె నేమని |
వినిపించెదవాఁడ నాదువృత్తాంతంబున్ ॥

ఇప్పటికినదియే నాతల్లి. సముద్రుఁడే నాతండ్రి.

వస్తు—రాజచంద్రా! ఇతనిచరిత్ర మద్భుతము. ఈతనితలిదండ్రులు ఘూర్జరము వైపున నున్నవారఁట. శత్రుబాధ మిక్కిలియైన కతమునఁగడుచిన్ననాఁడే యితనిఁబాసి వారెక్కడికోపోయిరఁట. తదన్వేషణవ్రతమూనియూరకసంచరించుచున్నాఁడఁట. వారియిక్కడ నెఱుఁగువఱకుఁగేశఖండనమైనఁగావింపఁడఁట. మొన్నసముద్రమున నొక్కయోడలోఁబోవుచుండ నీయోడ కేరళప్రాంతమున మునుఁగఁగా నితఁడొక్కరుఁడుమాత్రము బ్రదికెనఁట. ఇవియన్నియు నెఱింగినేఁ దోడ్తెచ్చితి.

చతుర—కుమారా! నీవు మాపీటనేయుండుము. నీతలిదండ్రులనెమకింతును.

నీల—రాజచంద్రా! నిష్ప్రయోజకుఁడనై నేఋణము జీవనముచేయఁగలవాఁడఁగాను. ఏదైనఁగార్యమిచ్చిన నుండెద.

చతుర—అంటివిఁ బాలుగారెడు పసిగందుమోముదమ్మిగల సుకుమారుఁడవే? నీవేమికార్యముచేయఁగలవు?

నీల—చూచుటకట్లున్నాఁడఁగాని యెట్టికష్టములకైన నోర్చుకొనువాఁడ.

ఉ॥ చాలనివాఁడనంచు నలసక్రియుఁడంచునునన్నుఁజూడకేఁ ।
జాలుదు యుద్ధభూమిరిపుసారమడంపఁగ వ్రాతవ్రాయఁగాఁ ।
జాలుదువంటకైనమఱి చాలుదునన్నియుమించికాపుమో ।
భూలలనేశనీఋణము భోజనమొల్లనుమ్రొక్కివేఁడెదన్ ॥

దండుననుంచినను, విలేఖకునిఁగా నొనర్చినను, సుదకు, పాచకకృత్యమునకైనఁ దగుదు.

చతుర—ముద్రఁగైకొమ్ము. ఈముద్రాధికారము నీకుండనిమ్ము. విలేఖకగణికాదులపై నధికారము గలిగియుండుము. (నిష్క్ర.)

శ్రీ

# ముక్తావళీనాటకము.

:o:

## తృతీయాఙ్కము-తురీయరంగము.

---

### కేరళపురివీధి.

[ప్ర: నాగకేతుఁడు.]

నాగ—ఆహా! ఎన్ని దినములకింత వృత్తాంతము తెలిసె. ఆముక్తావళి యీకేరళరాజ్య ప్రాంతమునకు వచ్చియున్నట్టు తెలిసె. ఈరాజ్యముననేయున్నదో లేక నంద్రమునఁబోయినదో? అయినను రాజధానికిఁబోయి యందేయుండి విచారింపవలయు. అయ్యో! ఆసోమశేఖరునిపై మోహమునఁదలిదండ్రులసయితము మాని యెట్టిపనఁబడ నుద్యమించిన యాతన్వంగి నన్నుఁగోరునా? అదినాకు లభింపకున్న నేజీవింపఁగలనా? ఈసంవత్సరమునుండి దానికై పరితపించుచు నాధనమును ప్రాణములను దానిపాలుచేయుచున్నానే? అక్కటా! సింహాయత స్వత్వుఁడగు నాసోమశేఖరునితో నేసిడనగుదునా? ఇదేలనాకీవట్టియాస? దీనిమాని నాపురికిఁబోవుదునా? అయ్యో! ఎట్లుప్రాణములభరించి పురికిఁబోగుదు?

(అనుబంధము 14.)

మొదట నాముక్తావళిపోయిన యాఱుమాసములవఱకు నదిమృతిపొందెననియే నేనును దానితండ్రియుఁ దల్లియునందఱు నమ్మియుంటిమి. నీలాలక తనమరణకాలమున రాఁగా వృత్తాంతముఁజెప్పె. దానివలన సోమశేఖరుని వృత్తాంతమును నాకృత్రిమయతి, కపటసన్యాసి వృత్తాంతమును దెలిసె. నాఁటనుండి తదన్వేషణవ్రతముఁబూని యడుగఁదగినచోట్లన్నియు నడుగుచు ముక్తావళి కట్టియుండినచీరకుఁ జతచీర చేపట్టి యూహూరు విచారించుచు రాఁగా నట్టిచీర యీయూరఁదొరకె. ఈయాఱుమాసములువడిన శ్రమమంతయు వీటిఁబుచ్చి యూరకూరికిఁబోగునా? ముందెట్లు జరుగనున్నదో చూచెదను. రాజధానికిఁబోయెదను. (నిష్క్ర—)

శ్రీ

# ము క్తా వ ళీ నా ట క ము.

## తృతీయాఙ్కము-పంచమరంగము.

### కే ర ళ వీ ధి.

[ప్ర: సోమశేఖరుఁడు-బ్రాహ్మణవేషమున.]

సోమ— (అనుబంధము 15.)

అయ్యో! నాయట్టి పాపాత్ముఁడెందైననుండునే? రాజ్యముఁబాసితి. తండ్రినిఁ గోలుపోయితి. నాకైతనకుఁ గారాగృహవాసముఁ గలిగించుకొన్న పిన్నతండ్రిఁజెఱవిడిపింపలేనైతి. ధీరోదారగుణవిరాజితుఁడుగా నాపిన్నతండ్రి చెఱవిడిపింపఁబ్రయత్నించుటయే సత్యవ్రతముగా జరుపుదునని చేసినప్రమాణపూర్వకమగు ప్రతిజ్ఞజరుపలేనైతి. అక్కటా! ఆచెఱసాల నతఁడెట్టియిడుములఁబడెనో? ఇంత యత్నాత్రప్రతిజ్ఞ గలుగునే? ననుఁబాసిపోయిన యాముక్తావళిజాడ యించుకంతతెలిసిన నూరికిఁబోయి సర్వసన్నాహములు చేయనెంచియున్నాఁడనే. అదితెలియకున్నదే? నాప్రాణపదముగానే నెంచి సర్వాశలుమోపెట్టియున్న తరుణీమణి ముక్తావళివిధివైపరీత్యమున ననుఁబాసినదిమొదలు పశ్చిమసముద్రతీరముననున్నయన్నిపట్టణములఁ బల్లెలవెదకుచువచ్చితినే? రెండుసంవత్సరములయ్యె నించుకైనఁ బొలకువతెలియకున్నదే? తెప్పనుండిజాఱి సముద్రమునఁబడియెనో? కాదేని నక్రాదులగు జలచరములేవైన మ్రింగెనో, యొండేనిలేకున్కికిఁదల్లడిల్లి బెగడొంది యపగతాశయై యసువులఁబాసెనో, లేకున్న సజీవయై నన్నెందైన వెదకుచున్నదో, లేక యాసముద్రమున నట్లేతేలియాడుచున్నపుడు నాతెరవునఁబోవు నావికులెవ్వరైన నాయతినఁజెఱవట్టిరో యెఱుఁగఁజాలఁగదా?

సీ॥ ఎడఁబాసిజడరాశిఁ బడఁద్రోసికడఁజేసి
నందుకావిధికెంత యడలిపడితొ।
బలువంతజలజంతువుల పొంతఁదలకెంత
మదిఁదాల్చి విధిలేక యదరిపడితొ।

కవగానకెవరైన నవమానలవమూన
 నడలొందికడుగుంది వెడఁగుపడితో ।
మనఁగోరినినుమీఱి నొనసాగిననుఁజీఱ
 కడునానవిడలేక బడలుచుంటి ।

తే॥గీ॥ యకట ముక్తావళీ తరంగావళీవి ।
భావళీహావ లీలాశుభావళీన ।
ధావళీఘనురో భావళీవిసమ ।
భావలీనసతీభంగి పాపసంగి ॥

ముక్తావళీ! నీబుణము నాకంతయే కలుగుగదా? మృతిఁ గలిగింపుగను భయము వెనువెంటఁ గలిగిన చావునకు సిద్ధముగనున్న సంభ్రమముచేత నొక్కటియు మనకేఁ దోఁచకుండు కాలమున నాకారాగృహమున నినుఁ గాఁగిలింపఁ గలిగినది మాత్రమే నానోముఫలమా? నాయట్టి పంతభాగ్యుఁడుండునే? అయ్యో! నాకొఱకు, పంత భాగ్యుఁడనగు నాకొఱకై నీవు తల్లిదండ్రులఁ బాసి దేశము మాని పరదేశపు పాలుగాఁ బడితివే? దానికై దుఃఖించెదఁ గాక నాయునికి కింపైన సగపను హా! దైవమా! ఇది రాతిరియయ్యె. ఇందొక సత్రమున్నట్టున్నది. ఈరాత్రి యిందుండి రేపు ముందుపోయెద. (పండుకొనును) ఏమిది? ఇట్టి యద్భుతాకారముగల యీకుంజరము నడయాడు నీలశైలము పగిది నూరిలోపలికి వచ్చుచున్నది. అయ్యో! ఆ యింటినట్లే త్రొక్కుచున్నది.

(లోపల కలకలము. ప్రవేశము-ఏనుఁగు.)

ఏమియు నెఱుఁగని భంగిమదించి యుండెడుగల యీసామజమును కట్టి చంపుటలు పేలకలిగె?

(పోయి యేనుఁగును చంపును.)

---

[ప్ర: బ్రాహ్మణుఁడు.]

బ్రాహ్మ—మహాత్మా! నిరంతరము మాకు బాధనొసంగుచు నిర్భీతిమై బ్రాహ్మణకృత్యము లెన్నియో యొనర్చుచు సర్వాయుధాభేద్యమైవిచ్చలవిడిఁ దిరుగుచున్న యీపాపపుఁ గుంజరమును జక్కాడి బకాసురుఁగూల్చి యేకచక్రపురిఁ గాచిన వాయుసూనుని భంగి, హిరణ్యకశిపు ఖండించి దేవపురిఁ బ్రోచిన నరకేసరిభంగిఁ గీర్తిఁగన్న నీ పవ్వారి వడుగ వచ్చునా?

సోమ—బ్రాహ్మణోత్తమా! నన్నేల యింత ప్రశంసించెదు? ఇదియేమంత ఘనకార్యము? నేను విలాసకుఁడను బ్రాహ్మణుఁడను.

బ్రాహ్మ—విలాసకా! నీపుణ్యమగణ్యము. ఈకేరళాధిపతియగు నంగారశర్మ బ్రాహ్మణక్షత్రియులలో నెవ్వరైన నీమదకరిం జంపినఁ దనకూతునిచ్చి యర్ధరాజ్య మిచ్చెదనని ప్రతిన నట్టియున్నాఁడు.

సోమ—విప్రపుంగవా! నాకు మీరాజ్యమును వలదు. మీరాజకుమారుతురునువలదు.

బ్రాహ్మ—అయ్యో! ఇట్లేటికి? ఇక్కడికి మూఁడామడలో రాజధానికలదు పోయి రాజదర్శనమైననుఁ జేసికొందువు రమ్ము. బ్రాహ్మణోత్తమా! ఇంకొక్కమాట. ఈయూరికింత దూరముననున్న సముద్రతీరమునఁ గొన్ని దినములకుముందు కొందఱు తురకలు సముద్రమునుండి యప్పుడే యుద్భవించిన జయలక్ష్మిఁబోలె నలరారు సుందరిం గాంచి కామింపఁగా నాయంగనామణిమంత్రములుచ్చరించి భూతిచల్లినంతనే యాతురకలు మూర్ఛిల్లిరఁట. ఆయమ మతియేమి తంత్రముఁజేసెనో నాటినుండి యా కుంజరు మీరాజ్యము నంతయుఁ బాడుచేయఁ దొడఁగె. నీకేమైన మంత్ర పరిచయమున్న నామంత్రమునకుం బ్రతిక్రియ యొనరింపుమా?

సోమ—ఎన్ని దినములైనది యాయమ వచ్చి?

బ్రాహ్మ—దాదాపు గా రెండుసంవత్సరములకంటె నెక్కుడయే యాయెను.

సోమ—హా! దైవమా! ఆతరుణీమణి యేమాయె? ఇప్పుడెందున్నది?

బ్రాహ్మ—అప్పుడు మూర్ఛపోయిన తురకలు లేచిచూచినఁ గానరాలేదు.. ఎందు వెదకినను జిక్కలేదు.

సోమ—హా! శ్రీహరీ! బ్రాహ్మణా! పోదము రమ్ము మీకేరళ రాజధానికి.

బ్రాహ్మ—ఇప్పుడుగదా మాకుధన్యత. ఆరాజకుమారుతురున్నదే—భళీ!

సోమ—పోదము రమ్మిప్పుడేల? (నిష్క్ర.)

———

శ్రీ

# ముక్తావళీనాటకము.



## తృతీయాఙ్కము-షష్ఠమరంగము.

### చతురవర్మకొలువు.

---

[ప్ర: చతురవర్మ-నీలకేతులు.]

చతుర—నీలకేతు కుమారా! ఈమూడేడులనుండి నీగుణము చూచియున్నాఁగను, మహోన్నత వంశమున నీవు జనించియుండుటయు ననుటకేమియు సందియములేదు. కొన్నిమాటలు నీతో నేనాడవలసియున్నది. ఇతరులతో నవిశ్వాసమున మాటలాడింపనెంచితి. ఎంచియు ధీరగుణోపేతుఁడవగు నీతోనాడుటకు సంకోచమేలయని నేనేయుద్యమించితి. నాకుఁ గళావతియను పుత్రియుండుటయు, నాపుత్రి నాప్రాణంబు ప్రాణమగుటయు, దానికై నేనింతరాజ్యము గలిగియున్నను బునర్వివాహముఁ జేసికొనకుండుటయు నీవు వినియుందువు. కేరళరాజ్యమునుండి నేఁబిలిపించియున్న జగంధరుఁడను చిత్రకారివల్లనే వ్రాయించియున్న యాకన్నియ చిత్రపటములలోని రూపమును జూచియుందువు. ఆకన్నియ ప్రౌఢయై రెండుసంవత్సరములైయుండియు నాయమ మనసరయక వివాహముచేసి యివ్వరాదని యిన్నాళ్లు గాచియుంటిని. ఒక్కరైన రాజకుమారుల నాయమ మెచ్చుకుండెడి. అనేకు లనేకు లైనా నిన్నెపుడు చూచినదో యాయమకు నీపై మదిగలిగియున్నది. నీకభీష్టమైన నాయాక్షేపణం తరములేదు.

ఉ॥ ఇన్నిదినంబులున్నృపుల నెవ్వరినొల్లక యున్నకన్నెదా ।
నెన్నఁడుఁజూచెనో ఘటన మేక్రియనున్నదొ రాకుమారకా ।
రన్నినుఁగోరెనాసుత కళావతిభాగ్య విశేషమయ్యెనా ।
కన్నియఁగోర నీకుమది గల్గినలేదిఁక యంతరాయముల్ ॥

నీల—రాజచంద్రమా! ఇది యెన్నఁటికైన నొప్పునా? కన్నుగానక మీకుమారి వరించినను, బుత్రియెడఁగల ప్రియమున నీవేయభయదాన మొసఁగినను, దారతమ్యమరయక నేనిందుకు సమ్మతింపవచ్చునా? నేను మీభటుఁడ. భటశబ్దముఁబట్టితినయ్యుఁడ.

ఆయమనాచెల్లెలు. ఇట్టివావిసరియా? మీసరివారిలో మీకునగుఁబాటుకాదా? నాకు మాత్రము కీర్తికరమా? ఇదికానిపని. క్షమింపవలయు.

చతుర—కుమారా! నీలకేతూ! నీసుశీలతకెంతయు సంతసించితి. యువానుఁడవై సర్వసుఖములఁ గోరవలయువాఁడవై, సుందర రాజనందనపాణిగ్రహణమును, నామూలమున రాజసుఖమును మీకబ్బునుంగాఁ దారతమ్యభంగినరసి నీవు వలదనుటయే నీధీరవంశజననమునుఁదప్పక చాటఁగలదుగదా ?

(అనుబంధము 16).

అయిన నీవాడిన యీవిషయము యోచనీయమే. ఈవిషయము నేను నాతనయకుఁజెప్పితి. ఆయమయొప్పదయ్యె. ఆమెనుగాదనఁజాలకయే గానిమ్మంటి. అయిన నీవే యీయాశయము చెప్పుటవలన మరలఁజెప్పెదను. అంగీకరించినను సంతోషమే. అంగీకరింపకున్నను మఱియుసంతోషమే. (నిష్క్ర.)

నీల— అకటా! నాకిదేమవస్థవచ్చెను ? నానాథుని వెదకుచు నేనూరకదిరుగుచున్న నతఁడును వెదకుచున్న నొకరికొకరికి సమాగమమే లేకుండుగావున నొక్కయెడ నేనున్నమేలని యిందేనిలచి వెదకుచున్నానే! ఇట్లుండ నీసందర్భమురాఁదగునే ? దైవమెట్లుచేయనున్నాఁడో తెలియదు. (నిష్క్ర.)

శ్రీ

# ముక్తావళీనాటకము.



తృతీయాంకము—సప్తమరంగము.

---

కళావతి యంతఃపురము.

[ప్ర: కళావతి—చతురవర్మ.]

కళా—అయ్యో! క్షమింపుము. చనువుమైఁబలికెదను. నీవే నీలకేతునితో నీమాట చెప్పినట్లు తోఁచుచున్నది.

చతుర—కుమారీ! నీయభీష్టము నెఱవేర్పుటకంటె నాకు వేఱొకకార్యముగలదా? ఆ నీలకేతునే పంపెదలెమ్ము. మాటలాడుము. (నిష్క్ర—.)

కళా—హృదయమా! తల్లడిల్లకుము. నామనోహరుని మంగళాంగదర్శనము సమీపమునఁ గలుగుటకు మదిభుగుల్లుమనుచున్నది.

[ప్ర: నీలకేతుఁడు.]

నీల—(స్వ) ఈపాండ్యరాజగు చతురవర్మయొద్ద నెన్నిదినములనుండి సౌఖ్యముగానుంటిని. ఇప్పుడిదియేమి యవస్థవచ్చెను? అతనికూతురు నన్నుఁగోరియున్నదఁట. నేఁ బెండ్లియాడవలయునఁట. నేవలదనినకారణము తెల్లఁజెప్పితిని. తనతనయతో మాటలాడెదననియె. ఇప్పుడు తనకూతురియొద్దకే నన్నుఁబంపియున్నాఁడు. దైవమా! నన్నేమిచేయనెంచితివి? (ప్ర) కళావతీదేవి! ఏమిపిలిపించితివి? ఆజ్ఞయేమి?

కళా—రాజకుమారా! నిన్నేటికిఁబిలిపించుటయు మాతండ్రి చెప్పఁడా?

నీల—తరుణీమణీ! చెప్పియున్నాఁడు. నేనునందుకుఁ బ్రత్యుత్తరముఁ జెప్పితిని. నీవు నను వరింపనెంచుట యపకీర్తికిని పరివారిలో నగుఁబాటునకుఁ గారణము. రాజ్యసంపదలుగల యువానులగు రాజకుమారులెందఱోయుండ, నినుఁజేపట్టుటయే స్వర్గభోగమని తలంచి యాశించు సురూపులగు ధరణీధవతనూజులెందఱోయుండ ననుఁగోరుట నీకుఁబాడిగాదు. మీతండ్రినాకేలికయగుటచే నాకునుదండ్రివాఁడి. ఇట్టివరుసతగునా?

## (అనుబంధము 17.)

కళా—ధీరపుంగవా! రూపముకొఱఁత వలనఁగాని, గుణలోపమువలనఁగాని, నడకతక్కువవలనఁగాని, నేనీకుఁదగననియంటివేని నీకుమాటాడకుండుఁగాని యీకారణములు నన్నెట్లుబాధించును? నామనసునకువచ్చిన సుగుణశీలసంపదలుగల మనోహరునిఁబెండ్లియాడుట నపకీర్తిగాని నగుఁబాటుగాని యేలకలుగు? ఇంక వావితగదని నీవాడుట యాశ్చర్యము. నీసతితల్లి నీతల్లియేయని స్మృతులుద్ఘోషించుఁగదా? అందున నీసతి తండ్రియగుటకును, నాపతితండ్రియగుటకును సందేహమేమి? అది తప్పనివావిఁగదా?

నీల—వనితా! ఏదియెట్లున్నను నావంశము నాకే తెలియకున్నదే, నీవెవ్వరియాలి వెవ్వరి కోడలవని నిన్నడిగిన తలవంపులగుఁగదా!

కళా—మనోహరా! ఈమాటకుఁ బ్రత్యుత్తరము నీకుఁదోఁపదా? నీధీరగుణమే నీసద్వంశజననమునుఘంటాఘోషముగఁ జాటుచుండ నదియొకరు వ్రాయవలయునా? నీవెవ్వరియాలవన్న నామగని యాలననఁజాలనా? ఎవ్వరికోడలవన్న—

నీల—తరుణీ! నేను నాతలిదండ్రులఁ గనిపెట్టువఱకుఁ గేశఖండనమైన—హా! శ్రీహరీ! —చేయననియున్నవాఁడ నీభోగమున కెట్లియ్యకొందు?

కళా—త్రికరణశుద్ధిగా నేఁగోరినమగని కాల ననిపించుకొనుటకంటె వేఱొకభోగము నపేక్షింపను.

నీల—మానినీ! నీకెట్టియుత్తమములనిచ్చినను నాకు మనసొప్పదు. కీర్తియుండ నాడికలుండ సౌఖ్యమయినను నీకులభింపదని నాకుఁదోఁచుచున్నది.

కళా—ఇంతయేల నీవుమాటలాడెదవు? దాఁపక వచింపుము. నీకింకెవ్వరిపైనసైన మనసుఁగలదా?

నీల—మానవతీమణీ! (కన్నీరునించి) నీవెంచిన టేకలరు—

కళా—అయ్యో! కన్నీరేలకలిగె? నీమోహమునకు నేనడ్డమురాను. నీమనోహారిణిని నేఁదోఁబుట్టువుగాభావించెద. నీమోహమంతయు నీమెచ్చులాడికొసఁగినను నన్నొకదాసియని యనుగ్రహించిన నంతయేచాలును.

## (అనుబంధము 18.)

నీల—భామామణీ! పతివ్రతాతిలకమవని నిన్నునుతికొలుపుటకు నీమాటలు సార్వపధీనములు. నీయట్టిసతీమణి భాగ్యాగాలభించుటకుఁగడుంగడునోచి యుండవలయుఁజూమా! నీమగఁడను. కావున నే నేనీకుఁదగనివాఁడ.

మ॥ అలినీలాలక నీసతీసుచరితంబత్యద్భుతంబ య్యధీ
ర లలామంబవు నిన్నువంటిలలనా రత్నంబు జేపట్టఁగాఁ
గాలిజన్మంబున దుర్గసీమఁదప మెంతో చేయఁబోలుం జుమీ
యలపుణ్యాత్ముఁడ భాగ్యసంగతుఁడ నేనత్యంతఁగానిందుకున్ ॥

క్రూరాత్ముఁడ. కలుషమానసుఁడ. నను వరింపకుము.

కళా.—నీగుణమే నీవాడినమాటలఁ గల్లఁజేయఁజాలు. క్రూరాత్ముఁడెట్లు చెప్పికొనుసా ?

నీల—కామినీ! నీవిట్లుపట్టుపట్టినవే నీయూరును నీతండ్రిదాస్యమునుమాని యొక్కడి కైనఁబోయెద.

కళా—ఇది పరమసమ్మతము—నీవెంట నేనును వచ్చెద.

నీల—హా! దైవమా! భామినీ! ఒకవేళ నేను మోసగాఁడని నీవు గుఱుతెఱిఁగిన నెట్లు ?

కళా—నీమోమునందలి తేజముఁగాంచిన మోసమునునది యూహాపథ యొడిగలుగ నుండఁగలదుగదా?

నీల—అతివా! మోసమెట్లయిననుండనీ. నేను నినుఁగన్న ప్రథమదినంబున యొకయోపరంపు నిన్నుఁబరిణయమాడుటొక్కటితప్ప వేఱుసౌఖ్యము కలుగదే ?

కళా—నేవిన్నవింపనా నీవు భార్యననిపించుకొనుటకంటె వేఱభిలాషము నాకులేదని! ఏలయిట్టి విషమపరీక్ష? నేను నీదానఁగాక యింకొక్కరిదానఁగాను. నీకిదితీఱనిపని.

నీల—ఏలయీనని కన్నులు తెఱచి దుఃఖాంబుధిఁబడ పాఱిపోవ నంచెదవే. నిన్నేమనఁ గలను ?

(అనుబంధము 19.)

కళా—ఎన్నిదుఃఖములకైన నెంత తిరస్కృతికైననోర్తుఁగాక నాయభిలాషము—నీవు వరించు భాగ్యముగను నభిలాషము-నేమానను. నీవు నన్నొల్లనినాఁడు ప్రాయోపవేశ మొనర్చి యసువులఁబాసెద. నీపాదములాన నేమనఁజాల. నీచేమిబాస చేయుము న్నను జేయుదాన. ఇదే చేఁజేత నాన పట్టుకొనుదాన. (అని చేఁబట్టఁగా.)

నీల—అతివా! నీయిష్టము. నాకైమాటలేదు. నీయిచ్చవచ్చినచో కానిమ్ము (పోవఁ బోవ.)

[పునః ప్రః చతురవర్మ.]

చతు—(నీలకేతునితో) మాటలాడితివా ? నీలకేతుకుమారా !

నీల—మాటలాడితిని. నాయత్నము లేకున్నది.

చతుర—యోచింపకుము. పొమ్ము. (నిష్క్ర.)

శ్రీ

# ముక్తావళీనాటకము.



[తృతీయాంకము-అష్టమరంగము.]

కళావతిపడకటిల్లు.

[ప్ర: నీలకేతుఁడు మంచముపైఁబండుకొని]

---

ప్రక్కన కళావతి వీణతో.

కళా— (అనుబంధము 20.)

నీల—(లేచి) కళావతీ వలదన్నను మానక మాదేశపద్ధతి భంగి ననుఁ బాణిగ్రహణ మొనరించితివి. నీసౌఖ్యమింతయేయని యెంచుము.

కళా—ఇంతకంటె వేఱు సౌఖ్యమును నేఁగోరలేదే ?

నీల—చెలువా ! నేఁగడుక్రూరాత్ముఁడసుమా ! అరయలేవైతివి.

కళా—అక్కటా ! నిష్కారణముగా నూరక నిన్ను నీవ యేమిట్లనుకొనియెదు ? ఆహా ! తెలిసెను. అగ్గలంపు మరులు పెంపున నిను నిర్బంధమున సేవరించుట క్రూర కృత్యమని నన్ను దూషించుసెపమున నిట్లనుకొనియెదవో ?

నీల—అయ్యో ! అటుగాదు. నిక్కముగా సేవంచకుఁడను.

కళా—కానిమ్ము నీవలననే వంచితకాఁజాలనే-కానే-ఇంకేల ?

నీల—పోనిమ్ము. నీకిపుడేమికావలయు ?

కళా—

క॥ పాలింతు వేనిగోరిక ।
యీలాగొనరింపనీకు హితమేనియు నీ ।
యాలింగనమొక్కటియే ।
చాలుం బ్రాణేశ వేఱు చందముగోర౯ ।

నీకు సమ్మతికాకున్న నీ యాజ్ఞేయొక్కటియే.

నీల—అదినే నంగీకరింపను.

కళా—భాగ్యము. నీమనసును హరించినయా వేఱొక్కవనిత నీకు లభింపవలెననుకొన్నావా? అట్లనే కానిమ్ము. నాతోఁబుట్టువాయమ యెంగున్నదో యానతిచ్చిన-

నీల—అట్లుగాదు.

కళా—కాకున్న భాగ్యము.

నీల—నే దురాత్ముఁడనని తెలిసిన నీవు నన్ను శపింపవేలు?

కళా—ఆమాటనకుము. నీవు దురాత్ముఁడవేయైన నిసుఁబాప పరిశుద్ధునిఁజేయుమని దైవ ముం బ్రార్థించెద నీయాన నిక్కము.

నీల—కళావతీ! నిన్ను నేనొకవేళ నితరుల వరింపుమన్న నేమిచేసెదవు?

కళా—అక్కటా! నన్నేలయిట్లు పరీక్షించెదవు? నీ యాశయమేమో తెలియదు. పతివగు నీవు నన్నింకొకని వరింపుమన్న నీయాన నెఱవేర్చిన నా కపాపమేలకలుగు? అదియేహితమైన నన్నుడుగవలెనా?

(అనుబంధము 21)

నీల—ఇపుడు నీవు నాదానవు. ఏది నీయాలింగనమిమ్ము?

కళా—(సంభ్రమమున నీలకేతు నాలింగనము చేసి యాశ్చర్యము భయము నభినయించుచు వెనుక జరుగును.)

నీల—(స్త్రీరూపముపూని) చెలియలా! ఇపుడు తెలిసెనా? నాగుట్టు ప్రత్యయము నా మోసము నా చరిత్ర మేమని విన్నవింతు? నీ శుద్ధమానసమునకు నేనేమి ప్రత్యుపకృతి యొనరింతు? ఈ నా మగఁడు (చిత్రపటము చూపి) నాకు లభించనేని నిన్నాతని కి అగ్రమహిషిఁగాఁ జేసెద.

కళా—హా! దైవమా! (మూర్ఛిల్లును).

నీల—సతీమణీ! ఇదియేమి? (ఉపచారములు చేయును).

(అపనికపడును)

తృతీయాంకము.

సమాప్తము.

శ్రీ

# ముక్తావళి నాటకము.

## తురీయాంక్యము-ప్రథమరంగము.

ఒకగది.

[ప్ర: జగంధరుఁడు.]

జగం—ఔరా! నాభాగ్య మసమానము. నీలకేతునిఁజూచినప్పుడంతయు నాకేమేమో సంశయము లుప్పతిల్లుచుండె. ఇప్పుడంతయుఁదెలిసె. ఈతరుణియే ముక్తావళియని తోఁచుచున్నది. అయ్యో! దీనికై నేనెంతశ్రమపడితి.

(అనుబంధము 22.)

సోమశేఖరుఁడెక్కడ నున్నాఁడో? వాఁడొద్దలేకుండుట యొకటి తెలిసెఁగదా. ఎట్లయినను గార్యము సాధింపవచ్చును, తపతీ తీరవాసులు కొందఱు నాతో వాఁడు తెప్పపై నిరువురు సతీపురుషులు పోయినది తొలి జామునఁజూచితిమనియు నా తెప్ప విఱిగి సముద్రమునఁ బడియెననియుఁ జెప్పిరి. అదియే నిక్కవమాయె. అయిననుఁజూతము.

[ప్ర: నీలకేతుఁడు.]

నీల—జగంధరా! రాజ్యాభిషేకము నాకుఁగలిగినందుకు నే బహుమతులిచ్చుచుండ నీ వా వేళ్ల రావైతివి? ఏకాంతమున నాతో నేమిమాటలున్నవి? నీకెక్కువ బహుమతులు కావలసియున్న నా స్థానమున నే యడుగరాదా?

జగం—దేవా! నీతోడనే విశేషముగా రెండుగంటలవఱకు మాటలాడఁదగియున్నది. ఇప్పుడవకాశము గలుగకున్న మఱియొకప్పుడు కానిమ్ము.

నీల—ఇప్పుడేకాని మ్మేమిమాటలు?

జగం—కూరుచుండవలయు. నాకు మఱేమియు నభిలాషము లేదు. నేను జగత్ప్రసిద్ధుఁడ నగు చిత్రకారుఁడను. నాకంటె నెక్కువపాండిత్యముగల వాని నేఁజూచియెఱుఁగను. అట్టిది నీయొద్దనున్నట్టున్నది. అదికావలయు.

నీల—ఏదియది?

జగం—నీవునిన్నరాత్రి నీభార్యకుఁజూపఁబోయిన నీమగని చిత్రపటము నేఁ జూడఁ గోరెద.

నీల—నామగఁడెవరు? చిత్రపటమేది?

జగం—ఏలదాఁచెదవు? సవిస్తరముగాఁ జెప్పెదవిమ్ము. భావచిత్రములు వ్రాయుటలో నా నేర్పు మా కళావతి చిత్రపటములే నిదర్శనములు. కేరళప్రభువునొద్దనున్న నన్ను పాండ్యరాజు పిలిపించి యీయంతిపురివైపున నాకెడమిచ్చి వ్రాయించుచుండెను. ఎందో నీయీడురూపుగల చిత్రము నేఁజూచియుండుటచే నిన్నిందుఁజూచినప్పుడెంతయు నామదికిసంశయము కలుగుచుండెను. నిన్నరాత్రి నీభార్యతో మాటలాడువేళ నేనాగవాక్షమునొద్దకు నాకస్మికముగావచ్చియుండి "కళావతీకనుమా నామగనిపటము" అని నీవువచించినమాటవింటి అశ్లేటిచ్చపడినిలిచితి.

మ॥ ఇదియేలా మఱుఁగింపఁజూచెదవు నీవృత్తాంతమాద్యంతము
న్విదితంబయ్యెనునాదుభాగ్యమునఁ దానీపెండ్లినాఁడేనిశి
న్మదనాభోగరతీసతీభ్రమద భావారూపము న్మానినీ
కదియేమీపురుషక్రియాపరత కాంతా నాకెఱింగింపుమా ॥

నీల—(యోచించి) ఇవన్నియుఁ జెప్పుటవలన నీకేమిఫలము?

జగం—ఫలములేక యొకకార్యముండునా? అపటముఁజూచి నీచరిత్రము వినుటయే ఫలము.

నీల—జగంధరా! రూపముమగరూపము. కార్యమునందును పౌరుషమునకుఁ గొదువగలుగదు. అయినను నావృత్తాంతము నీవడిగినందున నాస్త్రీత్వమంతయుఁ దరిగిపోవుచున్నది. నీవన్నమాటసత్యము. నేముక్తావళియనుదానను. ఏమాశ్చర్యపడెదవు? నన్ను ఱుఁగుదువా?

జగం—నామిత్రుఁడు నాగకేతుఁడను రాజకుమారుఁడు నీవృత్తాంతమంతయుఁ జెప్పియున్నాఁడు. అతఁడు నీకొఱకై మిక్కిలి పరితపించుచున్నవాఁడు. పిచ్చిపట్టినచందమున దేశదేశములదిరుగుచున్నవాఁడు. ఒకసోమశేఖరుఁడనువానికై వాని నీవు నిరాకరించితివఁట. అయ్యో! ఆనాగకేతుని సురూపమునకు నీకుందగుఁగాక యింకొకఁడు తగునా? అట్టివానినెం తలయించితివి?

నీల—జగంధరా!

ఉ॥ పావననాగకేతుని ప్రభావము పేరునుఁగాంచి తేనిను
క్తావళినీకుఁజెల్లెలను మారమణీమణి సోమశేఖరుల్
భావమునందుఁదప్పదను మావినుమానను మానియొంటి నుండం
బావనిచారుఁగాత్రిఁగొను మామనుమాయను మాజగంధరా ॥

నీమిత్రునినింకొకసారి నీవుచూచిన నాతని ప్రాణమానసముల నాప్రియుఁడగు సోమశేఖరుని యధీనమొనర్చుదాననవియు నాకొఱకై పరితపింపవలదనియు వచింపుము. ఆనాగకేతుని నేవిని యెఱుఁగుదుఁగాని చూచియెఱుఁగను.

జగం—కావుననే యిట్లాడెదవు. వానిఁజూచియున్న నిట్లందువా ?

నీల—ఊరకనాయెదుట నేలప్రశంసచేసెదవు ? వాఁడెట్టివాఁడైనను నాజీవితేశుఁడు సోమశేఖరుఁడే.

జగం—ఎందున్నాఁడా సోమశేఖరుఁడు ?

నీల—ఆమనోహరునికైకదా యింతపరితపించుచున్నాను ? ఎందున్నాఁడో యెందతని దర్శనము గలుగునో యెఱుఁగను.

జగం—తరుణీమణీ! నీకైమనసారఁదపించు నాగకేతునిమానియెందు నెఱుఁగఁబడనివానికై యిట్లేల తపించెదవు?

నీల—మఱియొకసారి యామాటనకుము.

జగం—కానిమ్ము, నాకేమిపట్టినది ? ఎట్టివాఁడా సోమశేఖరుఁడు ?

నీల—చూడుమీ పటము. (చూపును)

జగం—(ఆశ్చర్యపడును.)

నీల—ఏ మిట్లులికిపడితివి ? నీ వీ పురుషవరుని నెఱుఁగుదువా ?

జగం—ఎందో చూచినట్లున్నది. జ్ఞాపకమునకు రాదు.

నీల—జగంధరా ! నీవు నన్నింతదూరము నాచరిత్రము నడుగుట ధనాశచేఁగాని యితరముగాదు కదా ? నీకు వలయునంత ధనమిచ్చెదను. ఈ రాజ్యమే యిమ్మన్న నిచ్చెదను. అనుగ్రహించి జ్ఞాపకమునకుఁ దెచ్చుకొని యా మనోహరుఁ డెందున్నాఁడో చెప్పుమా ?

జగం—నేనింకను యోచించి జ్ఞాపకమునకుఁ జేసికొని యూరికేఁబోయివచ్చి విన్నవింతును. అయిన నీ చరిత్రమంతయు విన్నవించిన నట్టివాని నేఁ జూచినపుడు కార్యసాధనము కలిగింతును. (నిష్క్ర-౧)

నీల—అవశ్యము చెప్పెదను. యిప్పుడా స్థానమునకుఁబోయి మరలనింతలోన నేవచ్చెదను.

జగం—ఆ విలాసకుఁడా! సోమశేఖరుఁడు. ఈ తరుణీమణికి నాయందించుకైన ననురాగములేదు.

ఉ॥ ఈవనితాలలామ నను నింతయుఁగోరదెమ్ముంచె నేఁడు న।
న్నీవగసోమశేఖరున కెందున నేదులయాదునక్కటా।
భావభవాంగనారుచిర భావముగన్న సతీలలామ ము।
క్తావళినాకులేదనినఁ బ్రాణములెట్లు భరింతుదైవమా॥

ఆసోమశేఖరునితో శక్తియందుఁగాని రూపమునందుఁగాని నేనుదులఁదూఁగనోపుదునా? దీనిఁబాసి నేజీవింపఁగలనా? ఏమిచేయుదును? యోచింతుఁగాక. (నిష్క్ర-)

శ్రీ

# ముక్తావళీనాటకము.

చతుర్థాఙ్కము-ద్వితీయరంగము.

మలయదత్తుని యౌషధశాల.

[ప్ర: నీలకేతుఁడు-మలయదత్తుఁడు.]

నీల—వైద్యచంద్రమా! నీ యౌషధసంగ్రహము పరమాద్భుతదాయకము. ఎన్ని యమూల్యౌషధములున్నవి? ఈ యౌషధము లున్నయన్ని జాడ్యములున్నవియా యనిపించు.

మల—ఎన్ని యౌషధములోయున్న నొక జాడ్యము కుదురుట దుస్తరముకదా?

నీల—ఇదియేమి దీనిపై జీవారిరసమని వ్రాయఁబడియున్నది!

మల—ఇందుననే నా శక్తి వినియోగము దీని నావగింజంత సేవించిన నట్టి ప్రాణిగాని మూర్ఛిల్లును. కొంతసేపటికిఁదెలివివచ్చి రెండుమూఁడు గంటలలోఁ జచ్చును. కోసుకుఁ గోసిచూచినను విషమేయుండదు.

నీల—దీనికెట్లు నిదర్శనము? ఎట్లు నీకుఁ దార్కాణపడియె?

మల—క్షుద్రజంతువులపై వినియోగముఁజేసి చూచితిని.

నీల—ఈ యౌషధ మెందుకు సృజింతివి?

మల—ప్రాణ మిట్టిదని గుఱుతించు తలంపున.

నీల—గుఱుతించితివా?

మల—అట్లు గుఱుతించియున్న నీ భార్య జాడ్య మిన్నిదినములు గుణపడకయుండెనా?

నీల—వైద్యవర్యా! నాభార్య జాడ్యము నింకేమిచేసెదవు? నిన్నరాత్రియంతయుఁ బోడిదగ్గు వదలకుండె.

మల—రాజా! నేను నదియే యోచించుచుంటి. నీ వధిక మనోదార్ఢ్యముగలవాఁడవు. ఏయౌషధమిచ్చినను గుణపడకయున్నది. నీకిష్టమున్న నింకెవ్వరినైనఁ బిలిపింపరాదా?

నీల—అయ్యో! ఈ మాటేల? నీకంటెఁ దెలిసినవాఁడెవ్వఁడు? నే నీ సంవత్సరము నుండి చెప్పుచున్నానే? మనోజాడ్య మేమైననున్న దానికిఁ జికిత్స చేయరాదా?

మల—ఎన్నఁటికైనఁ గలదా? తాఁ గోరిన సుందరవరుఁడు, నందునను మగవారికైన మోహింపఁగల నీయట్టి కందర్ప సుందరుఁడు, లభించియుండుట నెన్ని మనో జాడ్యము లుండినను వెలిఁజేరవలయుఁగాక లేని మనోజాడ్యము వచ్చునా? ఒకవేళ నీవన్నట్లేయుండినను మనోజాడ్యములకు మందులు వేఱు, నితర జాడ్యములకు మందులు వేఱుగా నుండునా?

నీల—భిషగ్వరా! కన్నులు ముక్కుమాత్ర మేర్పడి శరీరమంతయు నింత శుష్కించి యున్నదే? ఏమైన నాశయుండునా?

(అనుబంధము 23.)

మల—ఊరడిల్లుము చింతిల్లకుము. నేనింకను బ్రయత్నముఁ జేసెద.

నీల—ఐననేఁ బోయినచ్చెద, మఱచితి. ఈ జీవారిరసము నాకింతయిమ్ము నేనునుఁ బరీక్షఁజేసెద.

మల—నను క్షమింపుము. నీకీఁదగనిదొక్కటియు నాకులేదు. అయినను దీనినియ్యను.

నీల—ఏల?

మల—చెప్పుదునా? చెప్పవలయునా?

నీల—నిర్భయముగా.

మల—నీకును గళావతీదేవికినిఁ బ్రాణ సమమయినప్రీతి. ఆమెకో రారాని జాడ్యము వచ్చినది. అట్టివేళ నీయొద్దనిట్టి యోషధియుండరాదు.

నీల—అట్లైన వలదు మా కళావతికి గుణముగలిగినవెనుకనే యిత్తువఁట లెమ్ము.

(నిష్క్ర—)

మల—నా జీవారిరసము ప్రభావమునంతయు సవిస్తరమునీరాకుమారునకుఁజెప్పుదునా? (యోచించి) ఇప్పుడేల? ముందుచూతము. (నిష్క్ర—)

---

శ్రీ

# ముక్తావళీనాటకము.



## చతుర్థాఙ్కము-తృతీయరంగము.

## కేరళమున నొకసత్రము.

---

[ప్ర: ఒకబోయయందుఁ బండుకొనియుండును.
తరువాత ప్ర: విలాసకుఁడు.]

విలా—ఏమిది? నేఁడొక్కరైన సత్రమునకువచ్చినట్లులేదు?

బోయ—హా! ముక్తావళీ! హా! ముక్తావళీ! నిన్నుఁ గన్నకడుపు దగ్ధమగుఁగాక.

విలా—(స్వ) ఇన్నాళ్ళకు వీనులుచల్లఁగ ముక్తావళియను పేరువింటిని. (ప్ర) అయ్యో! నీవెవరు?

బోయ—నేనెవరైన సౌఖ్యము నీకేమయ్యా? కడుపుగాలి చచ్చుచున్నాను.

విలా—ఏమీ? నీకేమైనది?

బోయ—ఎవరువిని యేమిచేయఁగలరు? నాకొంపకూలె. హా! ముక్తావళీ! హాలాహల హృదయమా!

విలా—అయ్యో! దుఃఖమొకరికిఁజెప్పిన నింతతగ్గుఁగదా? దయచేసిచెప్పుము. ముక్తావళి యెవరు? నీవెవ్వరవు?

బోయ—అయ్యో! నేనొక్కశబరుఁడ. ఐనను బెద్దలు సంపాదించినద్రవ్యము కలిమి ధనికుఁడనైయుండుట నక్షరస్థుఁడనైతి. నాపాలిమాలద్రవము ననుముక్తావళియను తొత్తువలనువేసె. దానినమ్మి సర్వస్వముం బోఁగొట్టుకొని పాడైతి. తుదకు నన్నుది మోసపఱచి—అయ్యో! ఎట్లుచెప్పుదును—ఒక మాలవానివెంటఁ బరుగెత్తిపోయెను.

విలా—అయ్యో! ఆముక్తావళి యెవరు?

బోయ—అయ్యో! దానిమాటనమ్మి చెడితినయ్యా! మొదటనే దాని వృత్తాంతము తెలియకపోయె.

విలా—ఇప్పుడేమి తెలిసె ?

(అనుబంధము 24)

బోయ—ఒకటియని రచింతునా ? అది ప్రౌఢయగుటకు ముందే చెడియుండెనఁట. ఒకరివెంట నూరువిడిచి పరిగెత్తిపోయి వాని వదలి నలుగురు తురకల కేకపత్నియై యుండి వారివదలి నాకొదవినది. అది తాను శుద్ధాత్మిక యనియుఁ, జెడకవచ్చిన దాననియు రాజుబిడ్డయనియుఁ జెప్పినమాటలకు మోసపడితిని. అయ్యో! మూఢాత్మా! రాజుబిడ్డయయినది శుద్ధాత్మిక యయినది నీయట్టి శబరాధమునకు లభించునాయని తెలియలేవైతివే ? ఛూ ! నీజన్మమేల ?

విలా—(స్వ.) హృదయమా! నెమ్మదిఁగనుము. అయ్యా! ఆముక్తావళి నీతో నే రాజు బిడ్డయని చెప్పెను ?

బోయ—ఏరాజుబిడ్డ యయిన భాగ్యమేమయ్యా ? ఆరాజు గొంతుకోయ. ఆ బిడ్డమంట పెట్ట దానికై జగంధరుఁడను చిత్రకారునకుఁ బదివేలనిష్కములిచ్చి యీ భావ చిత్రము వ్రాయించితినే ? (చిత్రపటము చూపును.)

పావిలా—(దీపముదెచ్చి నాలుగైదుమాఱులు బోయనుపటమును వీక్షించి కన్నీరునించి) దురాత్మా ? నీ వెవ్వఁడవో ఘాతుక బుద్ధిఁజేసి యిట్లు కల్పించితివి. నీవన్నమాట లొక్కటియు నిశ్చయముకాదు. నీ వాడిన యసందర్భ ప్రలాపముల నీవు స్థిరపఱప కున్న నీ ప్రాణము నిప్పుడు తీయుదును.

చం॥ తెలిసెఁబతివ్రతామణి సతీమణినూరక నిందచేసిన ।
న్గలఁపఁగవచ్చినాఁడవిటు ఘాతుకమానస యోకిరాతయీ ।
కలుష నిదర్శనంబులను గల్గినఁ జూపుము చూపకున్ననీ ।
తల పగలించెదన్గలఁగ దంచెద నొంచెదఁ ద్రుంచి చించెదన్ ॥

బోయ—ఏమయ్యా ! నా సుఖదుఃఖముల వినఁగోరి నన్నడిగిన సజ్జనుఁ డని నమ్మి నామనసునంతయు వెలిఁబెట్టితిని.

విలా—నీవు దృష్టాంతములు చెప్పకున్నఁ గొంతుకోయుదును.

బోయ—అయ్యా ! నాసంకటమునకు నేననుభవించుటకంటె దృష్టాంతము వలయునా? అయిననుఁ జూడుము. ఇది యీ ముక్తావళి సోమశేఖరుఁడను దురాత్మునిఁ జెఱనుండి విడిపించిననాఁడు కట్టియున్న చీరకారాగృహరక్షకుల మోసపఱపనాగయ్యాళి తన తండ్రినుండి దొంగిలించిన ముద్రాంగుళీయక మిది. (చీర నుంగరము నిచ్చును.)

విలా—హా ! దైవమా ! దురాత్మా ! ఇంతైన నినునమ్మను. వీనినీవేల దొంగిలించి యుండరాదు ? ఇంకొకటిఁ జెప్పుము. ముక్తావళితో నీ వేకాంతగోష్ఠికల వాఁడవు

నిజమైన నాసోమశేఖరుఁడెట్టి రూపముఁ గలవాఁడగుటయు నీకుఁ జెప్పియుండ వలయుఁ గదా? దానివచింపుము. అదిగాక యా సోమశేఖరుఁడును దానుఁగూడి యున్న స్వల్పకాలమున వాఁడు తన్ను ముక్తావళియనుటమాని వేఱొక పేరుపెట్టి కొమ్మనిన పేరును నీకుఁ దెలిసియుండవలయు. దానిపచింపుము.

మ॥ తాళలేనునిదర్శనంబు నిదర్శనంబులఁజూపుమో।
జోలియేటికిఁ జూపుచూపుము చూపుచూపును చూపఁగాఁ।
జాలవేనిదె జచ్చితీవిదె చచ్చితీవిదె చచ్చితీవిదె చచ్చితీ।
జాలిదీఱఁగజంపెదన్నినుఁ జంపెదన్నినుఁ జంపెదన్॥

నాకుఁజూడ నీవు మహాపాపుడవై పతివ్రతా తిలకము పేరుచెలుపఁబూనిన కాల హృదయుఁడవని తోఁచుచున్నది. నేనడిగినది వచించితివా బ్రదికితివి. కాదన్న నిప్పుడే చచ్చితివి.

బోయ— అనఘాధీరవిచార సారతరపుణ్యా నేఁడు నాపాలి పి।
ల్వని పేరంటమవౌచువచ్చి కుశలప్రశ్నంబుగావించినా।
యను తాపాయతి నాలకించినను సంహారంబుగావించదే।
ఘనధర్మాత్మ్ముఁడ వింకనన్విడు నమస్కారంబు గావించెదన్॥

పుణ్యాత్మా! పిలువని పేరంటమవై నాయెడకేతెంచి నాపాలిపగ దాయవైతివి. జారిణులగు స్త్రీలొకవిటుని మర్మము మఱియొకరికిఁజెప్పుదురా? ఒకనాఁడు తతాం తమైయున్న సంతోషపువేళ సోమశేఖరుని రూపవర్ణనము మాత్రము సచించె. దానిపై నీ కీయభిమానమేటికో యెఱుఁగను. నీవు లిఖితదృష్టాంతము లడుగునట్లు న్నది. ఇంక నన్నడిగితివా నీకు గురువునాజ్ఞకలదు. సింగము గఱచిన యంశ మూలముగల వానిరూప విభవ మీ చిత్రపటమే తెలుపఁజాలదా? (పటమిచ్చును).

విలా— పేరుచెప్పుము-పేరుచెప్పుము. ఆసోమశేఖరుఁడిడిన క్రొత్తపేరు-చెప్పుము-చెప్పుము. చెప్పకున్నఁగొంతుపట్టు.

బోయ—అయ్యో-అయ్యో-మంజువాణి-మంజువాణి.

విలా—హా! శ్రీహరీ! (మూర్ఛిల్లును).

(అనుబంధము 25.)

బోయ—దురాత్మా! పడిపొమ్ము. ఆముక్తావళితో దానిమగని గుఱుతించుటకని మోసపుచ్చి యీయంతరంగ మర్మములన్నియుఁ దెలిసికొని యున్నందున బ్రదుకు తెఱవయ్యె-అయ్యో! యీపాపాత్మ్ముఁడు నాగొంతెంతగాఁ బిసికెను? ఆపురుషు

కాంతపైనాకున్న మోహమతిమేలము. వీరిరువురకు మనసుచెడినదాని సులభముగ సాధింపవచ్చును.

విలా—(లేచి) పాపాత్మా ! శబరాధమా ! (బోయపైఁబోవు.)

బోయ—(పరుగెత్తును).

విలా—హా! దైవమా ! నన్నీగతికిఁ దెచ్చితివా ? ఇక్కడికి నీకార్పణ్యమంతయుఁ దీఱెనా? హృదయమున దావాగ్ని నెక్కొనియె. తలపై నశనిపాతమయ్యె. మృతపితృకుఁడనై బందీకృత పితృవ్యుఁడనై, విభ్రష్టరాజ్యస్వీకుఁడనై, అవిదిత మిత్రబాంధవుఁడనై, విఖండితాశుఁడనై నేనేల ప్రాణములధరించితి ? ఆముక్తావళికైకదా ? ఎవ్వరినిఁ దలఁపుగొనక యీయెడకుఁ బోవలయునను నిచ్చలేక దేశమంతయు నేనేలవెదకసాగితి ? ఆముక్తావళికైకదా ? దినమొక యేడుగానున్నను నాముక్తావళి నాకుసలభించుననునాశమాత్రముగలుగ గతవర్షములు దినములుగా భావించి ననుముంచి ప్రాణము హరింపనెంచిన నీదుఃఖసాగరము నొంటిచే నీఁతందరింపలేకున్నను, గట్టుచేరఁజాలకున్నను తదవతరణ మెట్టికార్యమో యెట్టిమాటయో యనునిరాశజనించినను, మునుఁగఁజాలక వెలికిఁ దలఁజూపఁజాలక సర్వసంకటముల ననుభవించి మ్రింగరాక మ్రింగితినే ? ఆముక్తావళికైకదా ? ఇదంతయు నిట్లగుటకా ? అకటా ! నేనేభంగి ప్రాణముల భరించువాఁడ ? ఎవరియాసఁగొని పృథివిపైనుండఁగలవాఁడ ? ఏయౌషధమున నీజాడ్యము హరించుకొనువాఁడ ? ముక్తావళీ ! ననుఁజెఱనుండి దప్పించిన దిట్లొనర్చుటకా ? నీవు శబరచండాలుల పాలగుదువని స్వప్నముననైనఁ దలంచియుంటినా? సోమశేఖరా! ఇట్లే దగ్ధుఁడవైపొమ్ము (పటముగాల్చి) ఈసోమశేఖరుని పాలికి మృత్యుదేవతవగు ముక్తావళీ ! నీవును నీశేషము నిట్లేపొందు. (చీరనుగాల్చి)

(అనుబంధము 26.)

హా! నిర్భరము. ఆపటము నేను దహించినట్లు నన్నిప్పుడెవ్వరైన దహించువారు గలుగరే ? ఎట్టియగ్నికైనఁ దాళుకొందుఁగాక యీదావాగ్ని కెట్లోర్చుకొందు ? ననుఁజంపువిషము నొసఁగఁగల పుణ్యాత్ములులేరే ? ఏవిషమునైన భక్షించి యోర్చికొందుఁ గాక యీమ్రింగుడుపడని కాలకూటమున కెట్లుతాళుదు ?

సీ॥ నాథనామక్రియానవ్యవైఖరిభామ
    నన్నాదరించు నంచెంచియుంటి ।
కానఁడాయెనెనాదు కష్టవి
    ధానంబునా దేవదేవుండునా విభుండు ।
నానందభైరవ ప్రారూఢిగలుగ నా
    కీయార్యధక్కునం చెంచియుంటి ।

సకలేశహననంబునకునైనఁ జాలు నా
శక్తియంతయు నేఁడు సమసెనకట ।

తే- గీ॥ బిలహరి ప్రాయమయ్యోనా పెంపదెల్ల ।
పొలఁతిలేకుండ నే నెందుఁబోవువాఁడ ।
వెలసెబాళివరాళి బల్ తలఁపుమాళి ।
యీవిరాళి సహింపనేనిందు మాళి ॥

ముక్తావళీ! ముక్తావళీ! నే నేల యింకను చండాలినిఁజేరఁ బిలుచుచున్నాను? పిలువ-వలదు. అయ్యో! ఎట్లువలదు? ఏమినలయు? ఏమనలను? ఓపఁజాల. ఈ తాప మాపఁజాల. నా పాపపు మోమెదురులకుఁ జూపఁజాల. విలాపము మానఁజాల. హా! హా! చండాలినీ శిలాకఠిన వజ్రకఠిన మానసా! అక్కటా! నేఁడుప్పుఁదలఁచితి. మది మది నా ముక్తావళి యట్టికార్య మొనర్చునా? మందభాగ్యుఁడనగు నను వరించి నా వెంటవచ్చినందున నా దౌర్భాగ్యము దానిఁబట్టి ననుఁ బాసిపోవఁజేసెను. నా స్మరహిత మైయుండిన యా సుందరాంగి సౌందర్యమున మరులుకొండ దే దురాత్ముఁడో దాని నిర్బంధమువలనఁ బరిభవించియుండవలయు. అవిధి మూలమునఁ గలిగిన పరిభవమును కారణముగా దానికిట్టి దుశ్చరితము గత్యంతరము గానని సమాజభావమైయుండవచ్చును. దాని పరిభవమునకుఁ బాపాత్ముఁడనగు నేనుగదా కారణము? అకస్మాత్తుగ నిలుపుకొన నన్నెంత తలఁచుకొనెనో? తన విధి నెంతదూఱెనో? ఎంతపాటు పడియెనో కదా? ముక్తావళీ! నీవేమి చేయుదువు? నేనేమి చేయఁగలను? మన యిరువుర ఋణానుబంధమే కలదుసుమా! నేనెంత పాపకర్ముఁడను? పుట్టిననాఁటఁగోలె సుఖమన్నమాట యెఱుఁగక యచింత్య కష్టములయవాచ్య దుఃఖములపాలైతి. నా క్రూరపుఁ బెంపున జగజ్జేగీయమాన పతివ్రతాలలామ మనిపించుకొని నా యర్ధాంగిని గాదున్న లలనాజనవతంసమును శబరచండాలుల పాలగునట్లు చేసితి. తద నిర్వ్యాజప్రణయముఁ బూని నన్నుఁగాకింకొక్కరుని వరింపనని నాయందబద్ధానురాగయై యాపాలసంబునఁ బ్రాణములఁబాయ జాలకనాఁడు నాఁటికి శుష్కించుచున్న యీయంగనాశిరోమణి కసూయా జాతయగు నిందురేఖ నెంతయు నొప్పించితి. దేశయాత్రఁ గడపుట తప్పగు. దుర్మరణము మైకొన్న నొప్పదు.

(అనుబంధము 27)

[ప్ర: మీననాథుఁడు.]

మీన—(చూచి) హా! సోమశేఖరా! ఇన్ని దినములకు లభించితివా? ఈ కేరళరాజ్య మున నున్నావని తెలిసివచ్చినందుకు నింత సత్ఫలము కలిగెనుసుమా? నీ వెట్లుతప్పించు కొంటివి!

విలా—పిత్రృవ్యా ! నన్నేట్లు గుఱుతించితివి ? నేనిందుండు టెట్లు తెలిసె ? అయ్యో ! ఇట్టికాలమున నానీమంగళాలింగనము నాకుఁ గలుగవలయునా ?

మీన—కుమారా ! నేనెట్లు తప్పించుకొన్నది యునట్లుండనిమ్ము. ఈ రాజ్యమునసర్వా యుధా భేద్యమైయున్న వనకుంజరము నొక బ్రాహ్మణుఁడు చంపినాఁడనుమాట జగమంతయు నిండియుండ నీ విందున్నాఁడవని నాకు వేఱొకరు చెప్పనలయునా? అదియు నుండనిమ్ము. "ఇట్టికాలమునసా" యని నీవాడితివి. అదియేమికాలము ? నీ ముక్తావళి యింకను నీకు లభింపలేదో ?

విలా—పితృవ్యా ! ఆ చండాలిని పేరెత్తకుము.

మీన—తనయా ! ఇదియేమిట్టిమాట లాడెదవు ?

విలా—అయ్యో ! ఆసంగతినంతయుఁ జెప్పెద నిటురమ్ము.

(నిష్క్ర)

శ్రీ

# ముక్తావళి నాటకము.



## చతుర్థాంకము-తురీయరంగము.

### కళావతి యారోగ్యశాల.



[ప్ర: కళావతి మంచముపైనఁబండి నీలకేతుఁడు ప్రవేశన.]

నీల—కాంతామణీ! నేనెంతచెప్పినను మానక కుమ్మరముపట్టి ప్రహారాత్మకయగు నా వలన వంచింపఁబడి యీ గతిదెచ్చుకొంటివి. నీయట్టిచెలికత్తె నా కన్ని జన్మములకు లభింపవలయు? నానాథుండు నాకు లభించెనా నిన్నుతని యగ్రమహిషిఁ గాఁజేసి నీదాసినై వర్తింపవలయునని యుంటి. నీశుద్ధమానసమున కటకటా ప్రతిక్రియగా భావిం చియుంటి. నాయభిలాషమంతయు వమ్మయ్యె. ఇంతకువచ్చునని యెఱుఁగక నాఁడెఱుఁగ నానాథుండు నను వెదకికొనుచు నందందుఁదిరుగాడినట్టిచో నేనొక్కఁడనుండుట తిరు గాడుచున్నఁ బరస్పరసంపర్కమున కేయాస్పదము గలుగదని యుంచెయుండఁగోరి నీ బలవంతమునకుఁ గాదననేరక నామోసము గుఱుతించినను నీవు ప్రాప్తమని యూ రడిల్లుదువనియు మన మిరువురము సవతుల మగుటకు నీవు శంకింపవనియు నమ్మి యాకూహాక పరిణయమునకు సమ్మతించితిఁగాక యిట్లగునని తలంపనైతిఁగా? సోద రీ! నీయునికినింకదాఁచి యేమిప్రయోజనము? నీకు మృత్యువాసన్నమైనది. నీవింద్రే పడుసంతాపమున కేమేరయే లేదు. ఇన్ని సంకటములకు నేను కారణము. నీ చేతికీ కరవాలము నిచ్చెద. ననుఖండింపుము.

(అనుబంధము 28)

సోదరీ! యొక్కింత మాటాడుము. నీకింతభంగపాటు కలిగించు నప్పటికి నాయందు టయు లేకుండుటయు నా దైవమెఱుఁగు. ఇంతవచ్చినపిదప నాయునికి యేల? నాకింక నాథుఁడేల? నీయట్టిసాధ్వీమతల్లి నాకుఁ దోడులేకున్న నెట్టిసంపదలు నాకే యూరటఁ దేఁగలవు? నీగుణగణముల గుఱుతింపనప్పుడంతయుఁ బురుషునకుఁగల మోహమునకంటె నెక్కుడగు వ్యామోహము నీయెడ నాకుఁ గలుగు. నా చరిత్రము నంతయు మఱతు. వేషముననున్న భంగి నిక్కంపుఁ బురుషుఁడనే గాఁ స్తుతి నేయని తల పోయుదు. ఇంతనిన్ను మోసపఱచి నను వంటిసందున నీవృత్తాంతము నీకుఁగూర్చు

తండ్రికైనఁ జెప్పకున్నదానవే. నీయట్టిగుణగరిష్ఠు నెందైనం గంటిమే? అట్టి నీవు ననుఁ బాసిపోవ నున్నావు? అక్కటా! నేఁజూడఁజాల. భరియింపఁజాల. నాచరిత్రము దాపఁజాల. ఇదె పోయి నీతండ్రితో నున్న యుదంతమంతయు విన్నవింతు. తలమున్కలుగా శోకాంబురాశి మునిఁగియున్న యాతనికిది భరించుట నింతయా? ప్రాణంబు ప్రాణమవై సుతునికి మాఱు సకల సంపదలకు మాఱుగానున్న నీయట్టిపుత్త్రి మృతిఁజెందుట చూడనున్న వాని కీశోక మొకయెక్కువయా? నాకాజ్ఞ యిమ్ము. పోయెద.

కళా—(చేయిచాపి నిలిపి) నాథా!

నీల—అక్కటా! ఇన్ని దినములయ్యు నన్ను నాథాయనుట మానవే దీని కెట్లు భరియింతు?

కళా—క్షమింపుము. ఆ శబ్దము పూర్ణముగా నాభావమున నిలిచియుండుట నీయునికి యెంత యెఱింగినను నాథాయని పిలుచుటమానను. నీవు స్త్రీవైన నేమి? నీవే నాదైవమవు. నానాథుఁడవు నాకుఁగలయన్నియు. అదియుండనిమ్ము. దీర్ఘాలోచన మొనరింపుము. నాప్రాప్తికి నీవేమి చేయుదువు? నీతప్పైన నేమి? పెండ్లికి సమ్మతించినదిగదా? నీవు సమ్మతింపకున్న నే బ్రదికియుందునా? పరిణయమైయున్నందున నొక్కొకవేళ నీవు పురుషుఁడవు కావని మదికి గోరంతతోఁచినను నాపతివి నీవేయనియునది కొరఁతయని యెంచుట పాతివ్రత్యమునకు భంగమని కటకటపడి యా పాపము గలుగకుండ దైవముఁ బ్రార్థించుచు నెడఁబాయని పతిగా నిన్నుఁ జూచుకొనుచు సంతసించుచు నింతవఱకు బ్రదికితినిగాని యటు కాకున్న నాఁడే మోహాతిశయమువలన దుర్మరణము నూలమునకో మఱియెట్లో కాయముఁబాయుదుమంటి. ఇందున నేమి విశేషము? అదిగాక యిట్లు కాఁగల సంగతినంతయుఁ బరిణయమునకు ముందే నీవు నాకుఁగంఠోక్తిగాఁ జెప్పితివి. దానిఁ సరకుగొనక మనఃపూర్తిగ నేనే యందుకు సమ్మతించితి. దీన నీనేర మేమి? నీవు పురుషుఁడవు కాకున్నందున తుచ్ఛమగు ననంగ సుఖము నాకొక్కటి కలుగదయ్యెఁ గాక నీ చెలితనము వడయుటకును, పతివ్రతాధర్మముల నాచరించుటకును నాకేమైనఁ గొఱఁతగలిగెనా? అంత యేటికి? నీవు నిక్కంపుఁబురుషుఁడవై యేదేని కారణమున నన్నాదరింపక నాకు సుఖము గలిగింపకపోయియుండిన నాపతివ్రతాధర్మాచరణమునకు బాధకమేమైనఁ గలుగుచుండెనా?. ఇప్పుడంతకంటె నేమి భేదము? కావున నింకొక్కమాటాడకుము. ఆడిన నాయానగాదు.

(అనుబంధము 29)

మా తండ్రి కీయుదంతము చెప్పినందున నీకైన నాకైన నతనికైన నేమిఫలము? అట్టిపన్నుఁ టికిని నొనర్పకుము. ఇది నావిజ్ఞాపనము. నీవిందే యుండుము. తనయావియోగము నఁబొక్కుచుండఁగల మాయయ్య నాతేఁడు మనినంతకాల మూరడింపుము. సోమశేఖరుఁడు నీకు లభించిన నిందే యుంచికొని మాయయ్య మృతిఁజెందిన పిదప నాతని వివాహంమాడి పట్టము గట్టుము. నీకుఁగొడుకులుగలిగిరా వారిలో నొక్కని నాకు సుతుగా నొనర్చి నాపారలౌకిక కరణీయముల నాచరింపఁ బంపుము. ఇంకేమియుఁ

చెప్పఁజాల. ఈమరణకాలమున దైవము నింతమాత్రము ప్రార్థించుదాన. ఈజన్మమున నోచనైతిఁగదా ? రాఁగలజన్మమున నైన నాపరమేశుఁడు నీకుఁ బురుషరూపము నిచ్చినన్నుఁ ద్రికరణశుద్ధిగా నీ సతిఁగాఁజేయఁ బ్రార్థించుదానను. ఇంక మాఁడకుము. నాలుగు నిమిషములకంటె మనఁజాల. దైవభజనముఁ జేసెదను. పోయి మాయయ్యను రమ్మనుము.

నీల—(పోఁబోవ)

కళా—నాథా ! పోయెదుగాని నాకొకకడముద్దొసంగుము.

(ఇద్దరు నాలింగనము చేసికొందురు.)

[ప్ర: మలయుదత్తుఁడు.]

మల—(నాడిచూచి కూరుచుండును.) రాజా! ఈయమజాడ్యము నాకేమియుఁ దోఁచకుండెడి. ఇప్పుడు చూచియున్నాఁడ. ఈబిడకు ప్రాణభయములేదని చెప్పవచ్చును. కానియికఁ రెండు మూడు దినములలోఁ దెలివివచ్చినామేలు. కాకున్న నంతరయమునఁ బుగిలిగి యున్మాదము పుట్టవచ్చును. చూచెదముగాక. భయపడకుము.

యవనికడిఁగజారును.

---



# ముక్తావళీనాటకము.



## పఞ్చమాఙ్కము-ప్రథమరంగము.

### నీలకేతునినగరు.



ప్ర: చతురవర్మ, నీలకేతుఁడు (జాబుతో)

చతుర—నీలకేతుకుమారా! ఏదీపించుము నీమిత్రునిజాబు.

నీల—మిక్కిలి పొడవుగా వ్రాసియున్నాఁడు. అయినను ముఖ్యాంశములఁజదివెదను. కొన్నికారణములు కలిగియుండుటచేతను, నా వ్రత పరిపూర్తియై యుండుట వలనను నేనిందులేఖను బరిణయమగుట కొప్పికొనియున్నాను. ఈకార్యమొనరింపు మని నీవు నాకు బలుమారు వ్రాసియున్ననుఁ జేయక యిప్పుడు నే నొనరించుట నీకు వింతగాఁ దోఁపవచ్చును. అది వ్రత విషయముగాని యితరముగాదు. నీ ప్రజ్ఞా విశేషమును, గరుణామాహాత్మ్యమును నైపుణ్యప్రశంసయు, నీతి కుశలత్వమును, బ్రసంగ వశమున విని నిన్నెప్పుడు చూతుననియు నీ ప్రేమాలింగనము వడయుదు ననియుఁ బరమాపేక్ష గలిగియున్నాను. ఉత్తరప్రత్యుత్తరములవలన మాత్రమేకదా నినుఁజూచి యెఱుఁగుదు? అయినను నీకలాకౌశల్యము నందువలన నే తెలిసి యున్నాఁడను. చూడ వలయునని మాత్రము కుతూహలము చెందియున్నాను. నాచరిత్రమున నింకను నెఱుఁ గదగిన రహస్యములున్నవి. అవి యన్నియు సమక్ష సంవాదమునకు మీఁదుపెట్టి యున్నాను. నా పరిణయమునకు నినురమ్మనియనుటకు నాకు నోరురాదు. ఈసం వత్సరమునుండి నీప్రియము నాప్రియకు నొకటి విడిచిన మేనమామ కూతురునగు కళావతికై యనంత చింతచే నుండువేళ నిట్టికార్యమునకు రమ్మనుటనుచితము. అయినను మిత్రతనూఁది చెప్పవాఁడను. చిరశోకముచేఁ బ్రయోజనములేదు. ఇట్టి సందర్భములు గలిగిన మిత్రసంవాదమూలమున దానిమఱవఁ బ్రయత్నింపవలయు.

ఇట్లు,

విలాసకుఁడు.

చతుర—కుమారా! నాకు దయగలుగదని నే జింతిల్ల వచ్చుఁగాక నీకేటికీయెడతెగని శోకము. పొమ్ము నీమిత్రునివివాహమునకు.

నీల—

సుగంధివృత్తము.

అంతమెందులేని దుర్వ్యథాంబురాశిఁబుత్రికా ।
చింతచేనిరంతరంబుఁ జీఱిపోలిదూలునీ ।
చెంతనుండి యూరడింపఁజేతఁగాకయున్న దీ ।
పొంతనట్టి నిన్నుమానిపోవనౌనె భూవరా ॥

అయ్యా! నీదండనుండి నిన్నూరడించుట దుస్తరముగానున్నదే. నిను మానిపోవుదునా? నీవు మని నంత కాలము నిన్నువిడిచి—

చతుర— కుమారా! నాకొఱకంతయేల? తనూజుని కంటె నాయుడనీకెక్కుడుగాఁ బితృభక్తికలుగుట నాకొక్క చింతయు లేదు. నీకొఱకు నేనేఁవచ్చెదను.

కవిరాజ విరాజితము.

సుతునికి మాఱుగసర్వవిధంబులఁజూచితినన్నునుదారత్వహా ।
మతిమతిఁబెండిలియాడఁగనొల్లవు మాటలనాడఁగనొల్లవు స ।
మ్మతిహితమిత్రులతోడనొకప్పుడుమానకయూఱడిఁబల్కుచుమాం ।
న్చితిసుతకై కడు నేఁబడుశోకమునీబుణమెన్నఁడుదీర్చఁగనక్ ॥

నామఱది కేరళరాజు నాకును సకరణముగ జాబు వ్రాసియున్నాఁడు. ఇరువురముంబోవుదము.

నీల—అట్లయిన సంతోషము. ఏమిది నాదక్షిణనేత్రమదురుచున్నది? యిట్టియశుభముగలుగనున్నదో—

చతుర—కుమారా! దక్షిణనేత్రమదిరిన మిక్కిలి శుభము గదా పురుషులకు—?

నీల—ఔను-తోఁచదాయె.

చతుర—ఎన్నఁడువివాహలగ్నము?

నీల—చైత్రశుక్ల సప్తమియనియున్నది. ఇరువది నాల్గుదినములున్నది. ప్రయాణమును కాయితము చేయింతము.

(నిష్క్రమింతురు.)

———

శ్రీ

# ముక్తావళీనాటకము.



పఞ్చమాఙ్కము-ద్వితీయరంగము.

[విలాసకుని విడిది.]

---

విలా—సేవకా ! ఆనీలకేతుఁడెట్లున్నాఁడు ? ఎప్పుడువచ్చెదనని చెప్పెనంటివి ?

సేవ—విలాసకరాజేంద్రా ! ఇదె తలఁచుకొను వేళకే వచ్చెను.

ప్ర: నీలకేతుఁడు.

విలా—రమ్మా ! మిత్రమా ! (ఆలింగనము చేసుకొనఁబోవ)

నీల—(మానిపి చేతులు పట్టుకొనును.)

విలా—సోదరా ! (ఆశ్చర్యమున) నిన్నేకవచనమునఁ బిలువ నాజ్ఞ యిమ్ము. నీరూప మెట్లోయున్నట్లు నేనెంచియుంటి. చూచిన నెంత వ్యత్యాసము? మిత్రమా? నీవింకను శోకము మానినట్లులేదు. మఱవవలయు. ఎంతశోకించినను నీకళావతి మరల వచ్చునా ?

నీల—(స్వ) ఆహా ! ఈ మనోహరుఁడు నామనోహరుఁడే. ఇప్పుడే గాఢాలింగనము పడయుదునా ? హృదయమా ! తట్టుకొనుము. వ్రత పరిపూర్తి యియినట్టు తెలిసె. అదియేమో విచారింతును.

విలా—మిత్రమా ! సుఖుఁడ వౌట వచించెదను. ఇదిమాన నీవు ప్రయత్నింపవలయు.

నీల—ఏది మానవలయు ?

విలా—అట్లేటికదరిపడెదవు ? నీ కళావతిపైఁజింత చేఁగదా నీవిట్లు యోచించుట ? నా కాలింగనమైన నీకుండుట ? నిను నేను గుఱుతింపలేదని యెంచితివా ?

నీల—ఏమిగుఱుతించితివి ? (భయమున)

విలా—అయ్యో ! ఇంతభ్రాంతియున్న నెట్లుమని యున్నావు ? ఉలికిపడిమాటలాడెదవు. ఏమిగుఱుతించినా? తొలుతనినాలింగనముఁ జేసికొనఁబోవవలదను భంగినీవు

హస్తాలింగనము మాత్రమిచ్చిన జాడ తెలియనా? ఇప్పటికిని నీఫాలభాగమున స్వేద ముద్భవించి కటతటములన్నియు నదురమహావేదనము గలిగిన చందము సూచింపు చున్నావు. లభింపఁజాలని పదార్థమునకై సంగురిన నేమి ప్రయోజనము? నేమిత్రుఁడఁ గాని నీకన్యుఁడఁగానని నమ్ముము.

(అనుబంధము 30.)

నీల—అంతయేనా? ఇదియే నాపుణ్యమా?

విలా—శక్తిమీఱినది. నీయధీనముగాని నాయధీనముగాని యేమియులేదు.

నీల—హా! దైవమా!

విలా—అదిగో! మరల నీచింతమానవే? (స్వ) ఎట్లైన మాటనఁజేసెదను. (ప్ర) సమా రా! మీమామయేలయిక్కడికి రాలేదు?

నీల—మామామయెవరు?

విలా—(స్వ) ఇదియసాధ్యము. ఇట్టివాని నేనేలరాఁ గోరితి? (ప్ర) మిత్రమా! కాల దేశముల ననుసరించి పరితాప ముజ్జగింపకున్న విధిలేదు. నీమోహమును వలసి సరితా పము నేనెఱుఁగనివాఁడఁగాదు. అదినాకుఁ గ్రొత్తదియుఁగాదు.

నీల—నీవును మోహమునఁబరితపించిన వాఁడనా? ఎవరిని మోహించి యుంటివి?

విలా—సచివా? ఆవృత్తాంతముననడుగకుము. సంకటమునకుఁ గారణమగు. ఈనాఁడు మనము క్రొత్తఁగా మొదటి సారి నొక్కరి నొకరు చూచికొనుట. కావున—

నీల—అట్లునా?

విలా—"అట్లునా"? ఇదేల యిట్లడిగెదవు? అదియును నీకుఁదెలియని విస్మయమా? కావున నీ సంకటమునకుఁదోడు గానన్ను సంకటము గుఱిచేయుచున్నది.

నీల—"నీసంకటమునకుఁదోడు నాసంకటము" సంకటము సంకటమే-ఏమిసంకటము?

విలా—నీవునన్ను విడుచునట్టులేదు కావున—

నీల—నీకెట్లు తెలియును?

విలా—(స్వ) వీఁడేమి మాటలాడినను నదియేధ్యానముగానున్నాఁడు. ఊరక మాటలు పెంచుట కంటెనీనికిఁజెప్పుట మేలని తోఁచుచున్నది. (ప్ర) మిత్రమా! నేను మాత్ర భాగ్యుఁడనై యొకతన్విపై మోహముగలిగి యుండియున్నాను పరితపించుచుంటిని. కావునఁజెప్పితిని.

నీల—ఇప్పుడు?

విలా—బుద్ధివచ్చియున్నది. కావుననిందు లేఖంగొనుట కొప్పితిని.

నీల—ఎవరిని మోహించియుంటివి ?

విలా—ఆదుష్కర్మురాలి పేరు నన్నడుగకుము.

నీల—అదియేల దుష్కర్మురాలు ?

విలా—ఆచరిత్రము నన్నడుగకుము.

## పద్మనాభవృత్తము॥

ఆరామచారిత్ర మేలావిచారింప నత్యంతతాపంబు గల్గించునా కున్ । గారాగృహావాసమాయెన్ మహోపాధిగల్గెంగదా దానిఁగన్ గొన్ననాఁడే । నారాజ్యముంబోయె నాసౌఖ్యముల్బోలెనాపిన్నతండ్రిన్ జెఱంబెట్టనయ్యెన్ । వారాశిపాలైతి రారానిశోకాబ్ధి భంగంబుపాలైతిఁ బ్రాపైతినయ్యో ॥

ఆచరిత్రము నన్నడుగకుము. దారను బాసితి. ప్రేముడించు పిన్నతండ్రిం జెఱనుంచితి. ఊరూరుతిరిగి పేరుపోఁగొట్టుకొని నాలుగేండ్లనుండి నన్నే కలవరించుచుఁ గృశయయిపోయియున్న పతివ్రతాతిలకమగు నిందులేఖ కెంతయు నపరాధ మొనరించితి.

నీల—ఆతరుణి యిప్పుడు జీవించియున్నదా ?

విలా—ఎక్కడపాడయియున్నదో నాకేటికాచింత ?

నీల—ఆతన్వియపరాధమైన సెయ్యది ?

విలా—అపరాధములన్నియు నాయవియే. అదియేమియు నపరాధ మొనరింపదు. నాకింత దుఃఖముగలుగుటకదియే కారణమనుట చాలదా ? దానిఁజూచి మోహించిననాఁడే రాజ్యముఁబోఁ జెఱనునుంపంబడితి, దానియాలింగనము-ఆపాపపు నాలింగనముగలిగిననాఁడే ప్రాణమునకంటె నెక్కుడగు పిన్నతండ్రిం జెఱనునిచి క్షత్రధర్మమంతయు వీటిఁబోవ శత్రువుపురమునుండి దొంగతనమునఁ బాఱిపోయితి. దానిముద్దుగొన్నయపుడే సముద్రమునఁబడితి. దాని తలఁపున్న వేళనంతయుఁజెప్పరాని యిడుమల పాలైతి. ఇట్టిద్రోహిణికిగా నెనరికిఁ గాలిగోటికైన నవి యెనకాదో యెవరిపేరు వచించినచోట దానిపేరునుడివినఁ జెప్పరానిదైన దూషణపాపము గలుగఁగలదో యట్టి సతీమణినిందులేఖను సంకటములకు గుఱిచేసితి. ఇంకేమి కావలయును? (కన్నీరునించును.)

నీల—(కన్నీరునించి) అయ్యో ! నన్ను క్షమింపుము. నీకుఁ గన్నీరు గలుగునట్లొనర్చితి.

మేఘవిస్ఫూర్జితవృత్తము.

బలాత్కారంబంచుఁ దలఁపకుమయోపల్కు నీమాటలింకన్ ।
విలాపంబింతేలా కలిగెనకటా వెగ్గలంబౌచుమోము ।
న్గళాహీనంబౌ యెన్గనలకునను న్గన్నులన్నీరు ముక్తా ।
వళింబోలెన్ బౌతెన్దలపఁగ మహాపాయ విభ్రాంతిదోఁచెన్ ॥

ధారలుధారలుగా ముక్తావళిఁ బోలె నేటికిఁ గన్నీరు దెచ్చుకొనియెదు ?

విలా—"ముక్తావళి" (ఆశ్చర్యమున) ముక్తావళియన్నందున నియర్థమేమి ?

నీల—అర్థమేమి ? ముక్తావళియన్న ముత్యముల గుంపనుట నీ వెఱుఁగవా ? ముక్తావళి కం కేమైనఁ జూడఁదగిన యర్థమున్నదా ?

విలా—ఏమో నే నెఱుఁగను.

నీల—నీవూరక యింతవఱకు దాని ద్రోహిణియని యంటివిగాని దాని ద్రోహము వచింప వైతివి.

విలా—అదినన్నడుగకుము నే వచింపఁజాలను. నీవిఁక నన్నడిగిన నాయాసగలఁగు.

నీల—

కం॥ తోయనిధిఁబడఁగరూపము ।
బాయఁగఁదలిదంద్రులనెడఁబాయఁగనసువు ।
ల్డోయఁగనై నను నొకటికి ।
నీయానకు వెలచుభంగి నేవెఱపఁగదా ॥

నీయానకు వెలచుభంగి నేనింకొక్కటికి వెఱవను. కావున మానసం మఱియొ క్కటి వచింపుము. ఆతరుణియే యిక్కడికి వచ్చిన నీవిప్పుడేమి చేసెదవు ?

విలా—ఏమిచేసెదనా ?

తే॥ గీ॥ దానితలగొఱిగించి సున్నమెనసల్పు ।
పూసిపారకను గొట్టించి రాసభమున ।
నుంచి మాలలచేనుమియించిపురినిఁ ।
ద్రిప్పవలయును నాకసిఁదీఱుకొఱకు ॥

నేఁబడినపాటుల కసియంతయుఁ దీఱదానికి క్షురకర్మచేయించి మోమున మసి పూసి పారకతోఁగొట్టించి మాలలతో నుమియించిగాడిదపై నూరేగించి.—

నీల—హా! సోమశేఖరా! (కన్నీరునించును.)

విలా—(స్వ) ఏమిది? సోమశేఖరా యనియె. ముక్తావళి యనియె. (ప్ర) మిత్రమా! నీచందము చిత్రముగానున్నది. సోమశేఖరాయని సంబోధించితివే? నీయర్థమేమి?

నీల—సోమశేఖరుఁడు నాదైవము. నాకులస్వామి. నాజీవదాతయని యెంచియుండుటచే సంబోధించితి. తలఁచుకొననైనరాదా? పేరైననొడువరాదా? (లేచును.)

విలా—ఏమిలేచితివి? ఏలపోయెదవు?

నీల—అవును పోయెదను. (కన్నీరునించుచు) (నిష్క్ర—)

(అనుబంధము 31).

విలా—ఈరాజకుమారుని చందము చోద్యముగానున్నది. ముక్తావళి యనియె. సోమశేఖరాయనియె. ఏమి భావమో? వీనినేనెన్నఁడును జూడకున్నను రూపముచాయ కొంతపరిచయముగా ధ్వని యెందోవినినట్టుగానున్నది. (తలగీరుకొని) ఏమియుఁ దోఁచదు. ఒక్కటి తోఁచుచున్నది. వీఁడును నాముక్తావళితీపులనుభవించినవాఁడు కాఁబోలు. దానికైయిట్లు పరితపించుచున్నాఁడుకాఁబోలు. ఆఱంకులాడిచెప్పియుండిననారూపములుచాయగుఱుతించినాఁడు కాఁబోలు, నాకుదానిదుశ్చరితముచెప్పినబోయ యది ప్రౌఢయగుటకుముందే చెడియుండెనని చెప్పఁడా? అట్లు దానిననుభవించినవాఁడు వీఁడేకాఁబోలు, సౌరాష్ట్రపురమునఁ గారాగారమున నేనుండినకాలమున వీనిధ్వనివిని రూపముచూచియుంటిఁ గాఁబోలు. వీఁడు నాకుఁబరమమిత్రుఁడాయె. వీనియెదుట నాకులటా వృత్తాంతము నేనేలదాఁపవలయు? వానివిడిదికేపోయివృత్తాంతము లన్నియుఁజెప్పి వినివచ్చెద.

ప్ర: సేవకుఁడు.

సేవ—రాజచంద్రా! పల్లకివచ్చియున్నది. చతురవర్మ రాజుగారి నాందీవ్రతములకు వేళయయినదనియు నభ్యంజనముచేసికొనవలయుననియు రాజసేవకులు విన్నవించుచున్నారు.

విలా—ఇదేవచ్చెద. (స్వ) అభ్యంజనమయిన పిదప నీలకేతుని యొద్దకుఁ బోయెద.

(నిష్క్ర—)

శ్రీ

# ముక్తావళీనాటకము.

---

## పఞ్చమాఙ్కము-తృతీయరంగము.

---

నీలకేతుని విడిది.

ప్ర: నీలకేతుఁడు.

(అనుబంధము ౨౨.)

నీల—ఇదిఫలమా! ఇదిఫలమా? హా! నిర్భరము. ఇన్నిదినములు సంకటములన్నియు ననుభవించి భరించినయాశ నేఁడుపూర్తియయ్యె—పరిపూర్తియయ్యె. కడుపునిండె. నోములన్నియు ఫలించె. మనసున కానందము జనించె. ఇట్టిపుటకేకదా నేనిన్ని దినములు జీవించినది? సముద్రమా! నీవెంత పగసాధించితివి? నాకగు కష్టము లన్నియు నీకుఁదెలియకుండెనా? నన్నేల మ్రింగవైతివి? ఒకటికాక రెండుమాఱులు, ఒకదినముగాక నెలదినములు మునిఁగిపోవనుండి నీలోనివసించియుంటినే? ఇన్నియు ననుభవింపుము పొమ్మని నన్ను వెలివేసితివా? అయ్యయో! అక్కటికి మించుస్థాన లేక కేరళస్థానముదండ నేనున్నయోడనంతయు ముంచితివే? నన్నేల బ్రదికించితివి? ఇప్పుడు నీపగతీఱెనా?

హా! కళావతీ! ప్రియకళావతీ! నినువంచించినందున కిదిఫలమా? ఇదిఫలమా? చేసేతఁ గుడుచుచున్నాను. నిరపరాధినివై యేమియు నెఱుఁగని గోలవై యీతిలోకమోహైక దర్శినివైనను నమ్మి వంచితవై మృతిఁజెందిన నీయసువు నన్నూరక పోనిచ్చునా? జననీజనకులారా! మిము నుల్లంఘనము చేసి నాపై నత్యంతమోహము నిండారఁ బ్రేమఁడించుచు ననుఁగాపాడుచున్న మీతో నొకమాటైనఁ జెప్పక మిము వంచించి దూరగనై వెడలితినే? అయ్యో! ఇదిఫలమా? ఇదిఫలమా?

అయ్యో! నాకిట్టిగతికలుగునని యొకనాఁడుఁ దలంపనైతినే? ఈపాపపు వివాహమునకు వచ్చుబుద్ధి నాకేలకలిగె? వచ్చి నామనోహరు నిందేలచూచితిని? చూడకుండినను నభిలాషచే నాళచే మృతిఁజెందియుండిన క్షేమముగనుండెనే? అట్లుఁగాక మనోహరుఁడే మృతిఁజెందెనని నాకుఁ దెలిసియుండినను, నింత దుఃఖము నాకుఁ

గలుగకుండునే? తృప్తిరయై ప్రాణములఁ బాయుచుంటిని. నిర్భాగ్యురాల నౌదుఁ గాని యిట్టి హతభాగ్యురాల నౌదునని యూహింపనైతి. "నావిభుఁడు నాకొక్క నాఁడైనఁ జిక్కును. చిక్కినను మక్కువచేయును. నానోము నతికొక్కును" అని యంతరాళమున సౌధములు నిర్మించినభంగి నూహలు సేసికొనుచు సంతసించు చుంటినే? ఎంత యొక్కొకసారి నిరాశకలిగినను లేనియాశలు తెచ్చుకొని నెమ్మది పొందుచుంటినే. ఇదిఫలమా? ఇదిఫలమా?

ఇంతవఱకు నాశయను కోటకట్టుకొని ప్రాణముల నందునివసింపఁజేసి యుంటిఁ గదా? ఆయంతరాళ సౌధములన్నియు నేఁడుకూలిపడియె. ఆకోట నేఁడుప్రక్క లింపఁబడియె. అక్కటా! ఆవిభుఁడు నేనొనర్చిన యపరాధములనైన నుగ్గడించి యుండిన సంతోషమున నతని చరణసన్నిధిఁ బ్రాణములఁ బాయుచుంటినే? నా తప్పె నాకుఁదెలియని గతికలిగెఁ గదా? ఇట్టి దిక్కులేని భంగికలుగునే? నను మోహించిననాఁడుతొఁజెఱవడియెనఁట. కౌఁగిలించిననాఁడు వనధిఁబడియెనఁట. ఇది నానేరమా! తనకంటె నెక్కుడగు దుష్ప్రాప్తి నాకుఁగలుగదో? తలిదండ్రులు కలిగియుండియు లేనిభంగినొనరించుకొంటి. పన్నీటివాకల యందుఁజేరుటకు భీత నగుదాననయ్యుఁ బూర్ణప్రవాహసంచలితతపతీతరణమున నుద్యమించి జలరాశిపా లైతి. రాజపుత్రినయ్యు నీచసేవకుత్సహించితి. ఇదియంతయుఁ బరమభాగ్యమని నేభరింపనా? ఇదిఫలమా? ఇదిఫలమా?

మీననాథా! మీననాథా! నాకొఱకై యెంతప్రయత్నము లొనరించితివి! అభేద్యమగు కారాగృహమునకుఁ బోయి యనన్యసాధ్యుఁడగు ననిమేషు వంచనంబొన రించి మాకుగా నీవే మనఃపూర్వకముగఁ గారాగృహ నివాసమునకు సమ్మతించి తల పోవునంతటి కార్యమున కియ్యకొను నతిలోకధీర కృత్యమొనరించి తనయయందు నన్నాదరించి సంతసము జనింపఁజేసితివి. ఇదిఫలమా? ఇదిఫలమా?

అయ్యో! నేనేమి చూచుచున్నాను? ఏమి వినుచున్నాను? అన్నియుఁజూ చుచున్నాను. ఒక్కటియుఁ గానరాదు. అన్నియు వినుచున్నాను. ఒక్క టియు వినరాదు. కన్నులారా! మీరింకొక్క పదార్థముఁజూచుట కిచ్ఛయిం తురా? మీరిట్లే మూసికొని యేలపోరాదు? చేతులారా? మీరింకేకార్యము చేయఁగలరు? అట్లే యేలపడిపోరాదు? ప్రాణమా? మొండిప్రాణమా! నీకింకే యాశగలదు? ఏల నను వెడలి పోవకున్నావు? ఆహా! నాతల నిలువదయ్యె. (పెట్టెలోనున్న జీవారిరసముఁదీసి) ఇదే యీవిషయముంగొని యనువుఁబాసెద. (నోటివఱకు గొనిపోయి) చేతులారా! మీకేల యీవణఁకుగలిగె. మానసమా! నీవేల తటతటఁ గొట్టుకొనుచున్నావు?

జీవారిరసమా! నీవేనాయేడుగడ. నీవే నాకష్టములకంత్యము, నీవే నాకుఁదరుణో పాయము. మానభంగ భంగోత్తుంగ చింతాశోకసముద్రమునుండి ననుఁదరిఁజేర్చు

తరణిపీవ. ఆమలయదత్తుఁడను వైద్యునొద్ద నతనిప్రాణము విసికించి పరీక్షింతునను నెపమున మోసపఱచి సంగ్రహించిన యీజీవారిరసము నాకెంతి యుపయోగకారి యయ్యె? నామనోహరుఁడు చచ్చెననువార్తవినిన యుత్తరక్షణముననే దీనిసేవించి కృతకృత్యనౌదునని యెంచియుంటి. ఇప్పుడు నాయెంచినభంగి నట్లుగాకున్నను ఫలముననంతకంటెను క్రూరకృత్యమాయె. దీనినిప్పుడే భుజించుచున్నాను. (ఎత్తి నోటికడకుఁగొని క్రిందఁబెట్టి) చేతులారా! మీకేల యీవణఁకుగలిగెను? ఎల్లప్పుడు సేవావృత్తిఁజేయుచుఁ బురుషరూపకాంతయైయుండిననుఁ బ్రియుని పతిభావమునొందిన కళావతీ సతీమణిని మనసార స్మశానమున దహించు నగ్నిపెట్టునప్పుడైన మీకు వణఁకులేదే? ఇప్పుడా కలిగె?—మానసమా! నీవేల తటతటఁగొట్టుకొనుచు డోలాయితమగుచున్నావు? తలిదండ్రులయాజ్ఞఁగొనక వారిఁబాసి వచ్చునప్పుడైన సముద్రమున దిక్కులేనిభంగిపడి మునుఁగనున్నప్పుడైన నీకుశంకాతంకము గలుగదే? సమయము వచ్చినపుడు వెనుదీసెదవా? చేతులారా! ఈమానసమునకు మీరైన బుద్ధి చెప్పుఁడు. (మొట్టమొదట ననుభంగపాటొనరింపఁ బాల్పడు పురుషుల బాధలకుం దలఁకి నేఁబురుషవేషముధరింప నెంచి నప్పుడెందునకుఁ బ్రతిబంధకము గానున్న నాగుబ్బ చనుంగవ నట్టెయణఁచి కట్టుకొన సమకట్టితిఁగా? అప్పుడును నీగుప్తమానసము తొడిఁబడియె. అయ్యో! నాథుని కరములకానందము గలిగింపనున్న యీయుబ్బు గబ్బిగుబ్బగవనిట్లు రూపుమాయుట తగునాయని వాదులాడ. కాపురుషవేషమున లోకమును వంచింపనైన—ఆమూలమున నొక్కటియు నెఱుఁగని ముద్దులాడి పతివ్రతాతిలకము ప్రాణమునకుఁ గుఠార మెత్తుటకైన నోర్చెఁగాని కుచకలశములనదుముటకోపదయ్యె.) అప్పుడో చేతులారా! మీరే విజృంభించి దానికి బుద్ధిగఱపి యామానసమునే యణఁచికట్టి నలీలనాకార్యము చేసితిరి? ఇప్పుడేల యట్టి బుద్ధి గఱపరాదు? పరాకుమానిరెండు (చేతులనోషధి తీసుకొని)

ఒక్కమాట. దీనిఁదీసికొని నేమృతనైన నేమిసాధించినట్లు? పురుషవేషమున నిన్నాళ్ళుండియు నించుకైనఁ బౌరుషములేకునికిదగునా? నన్నా—సోమశేఖరుఁడేమ నియె? క్షౌరము చేయించి—అయ్యో! నాకు వెండ్రుకలు తలనిండ నుండుటఁ జూచి యెవ్వరైన నాపురుషాకృతి సంశయింతురోయను భయమున దానికిఁ దప్పుఁ గారణము సృజింపనేఁ దలిదండ్రులచంద మెఱుఁగుటకుఁ గేశఖండనమైనఁ గావింప నని ప్రతిజ్ఞపట్టినట్లాడితి. అట్లాడునప్పు డాకేశఖండనమనుమాట యెంతసంకటపడి యెంతపరితాపముఁ జెందియాడితి. అట్టి నన్నిట్లు చేయింతుననెఁగదా? కోరగించి మోమునమసిపూసి—మాలలచేనుమియించి—ఇవియన్నియు నేలత్రవ్వుకొనవలయు—ఇట్టి భంగికలిగింతుననెఁగదా? నామోహమంతయుఁ దుచ్ఛమొనరించి యిట్లాడిన వాని నేమొనరించినట్లయ్యె. ఇంతపగదాయయగువాఁడు నేఁజచ్చుటవినిన నింకను నానందముఁ జెందఁగలఁడుకదా? తొలుత వాని నేఁజంపి—రామరామ! ఎంతమాటాడితిని? నేఁజేసినపాపములకెల్ల వన్నె వెట్టినట్లీకార్యము నేనాచేయనెంచితి? అయ్యో!

పతివ్రతా మహోదార తిలకమగు కళావతితో నిన్ని దినములు సహవర్తనము గలిగి యుండియు నిట్టిబుద్ధియా? తొలిజన్మమున నే దంపతులఁబాపఁజేసి యెంతటిపాప మొనర్చి యుంటినో యీజన్మమున ని ట్లనుభవించుచున్నాను. ఈజన్మమున నీ పాపము వలయునా? పరస్పర మోహాతిశయముల వెలయుచు, నేఁడే సకలైహిక సౌఖ్యముల పొందినట్లానందించుచున్న యిందులేఖా సోమశేఖరుల నోటి కడితీసి నట్టులెడఁబాపవలయునా? ఆయిందులేఖ నాసోమశేఖరుఁడౌదల ధరించిన భంగి నీ యిందులేఖ నీసోమశేఖరుఁడు శిరసావహించి సుఖముగనుండనీ. పరమేశా! నా కిట్టిబుద్ధి కలిగినందున రానున్న పాపములనెల్లఁ బాపుము. తప్పాడితి, తప్పాడితి. ఇంక యోచింపను. భక్షణముఁజేసెదను. (మందుచేఁబట్టి).

మఱచితి, నాచరిత్రము నెఱిఁగినవా రొక్కరునులేరు. కావున దానినంతయు వ్రాసియుంచి పిదప మృతనయ్యెద. (కాగితము లేఖినియుఁదీసికొని)

అక్కటా! అంగకారసదృశమగు నాచరిత్రము నిట్టివెలుఁగున వ్రాయఁజాల. వ్రాయుచున్నదిచూచి యోర్వఁజాల, నాకన్నుల నేనమ్మఁజాల, నన్ను నేవిశ్వసింపఁజాల, చీఁకటింటనే వ్రాసెదను (లోనికిపోవును)

ప్ర: విలాసకుఁడు.

విలా——ఇందునునీలకేతుఁడు లేకున్నాఁడు. లోపలనున్నాఁడని చెప్పిరి. ఇందుఁగూర్చుండి యున్నట్లున్నది. వచ్చునుగాఁబోలు. ఇందే కూర్చుండెద. ఆహా! ఏమోమంచివాసన వచ్చుచున్నది. ఎన్నఁడు నిట్టిసువాసనగానను. పుష్పాదులవాసనగాదు. (వెదకి వెదకి) ఆహా! ఈసంపుటమునుండియే యీవాసన వచ్చుచున్నది. ఇదియేదోలేహ్యముపలెనున్నది. (తీసికొని) ఏ మపురూపమగువాసన? దీనిరుచియెట్లుండునో? నీలకేతుఁడువచ్చిన నడిగి భుజింతును. ఎంతసేపునకురాలేదు. ఇంతయున్నదే? ఒక్కింత రుచిచూచిన తక్కువగునా? నీలకేతుఁడు వలదనునా? (రుచిచూచి) ఆహా! ఎంతమధురముగానున్నది? లేహ్యమింతమధురము నే నెన్నండును జూడను. ఏమిది? తలతిరుగుచున్నది? కడుపునఁజేయిపెట్టి కలచినట్లున్నది? అయ్యో! ఇదేమి లేహ్యము? హా! హా! (మూర్ఛిల్లును)

(అనుబంధము 33.)

పునః ప్ర: నీలకేతుఁడు.

నీల——ఆహా! ఈసోమశేఖరుఁడిందిట్లుపండుకొని యున్నాఁడు? అయ్యో! ఈయోషధి యితని చేతి కెట్లువచ్చె? తినియున్నాఁడే? ఏమిగతి? ఏదితెఱఁగు? అక్కటా! నాకెట్లునుఁబ్రాప్తిలేదుకదా? ఆ యిందులేఖ ప్రాప్తియునింతయేనా? ఈమహానీయుఁడెంత నను నోనాడినను నామోహము తగ్గకున్నది. మోహమా! ఇదిఘోర మోహము.

## (అనుబంధము 34.)

### ప్ర: జగంధరుఁడు ప్రక్కన.

ఇపుడు విషభక్షణముఁజేసి యింకొక్కాలు గడియలకుఁజావనున్నాఁడు.

జగం—(స్వ) ఆహా! ఈతరుణియే వీనికి విషమిడియున్నదా ?

నీల—ఎంతవిషాహారమునఁ జావనైనను మోముముద్దుగొనుటకు లోపములేకున్నదే? మనోహరా ! నీకును నాకు నింతయే భాగ్యము సుమా !

సీ॥ ఆభోగిపరఫణాయుతము నీపేరురం
బున గూర్చుభాగ్యంబు మొనయనైతి ।
కల్యాణియనినీవు కడుముదంబునఁబిల్వ
వినుభాగ్య మింతైన నెనయనైతి ।
వటునాదుప్రణయమా నాటకురంజిల్లు
నిన్నుముద్దాడంగ నేరనైతి ।
భైరవంబైన యీభంగినుండఁగ నిన్నుఁ
జూచుభాగ్యమునకే నోచియుంటి ।

తే॥ గీ॥ పాతకంబెగడనచేసి పాడుపడితిఁ ।
బూర్వభవమునఁనూరక పోవఁగలదె ।
తోడినీడగనినుఁగూడి యాడలేని ।
కలుషవతినాకు దక్కంగ గలవెనాథ ॥

తెలివినున్న నీవునాకియ్యని ముద్దు నే నిప్పుడైనఁ గైకొందునా? ఆహా ! మానఁజాలను. (ముద్దిడికొని) అక్కటకటా! ఇట్టి భయంకరమాధుర్యమెందైనఁ గంటిమే ? మనోరమణా ! నీకుఁబ్రాణదానమిచ్చుట కశ్వినులైన నేరరుగదా ? నేనుమాత్రము నినుఁ బాసిజీవించి యుందునని నమ్మకుము. అయ్యో! నను సుఖాంబుధి పాలుచేసినను, నీ యందులేశమైన సుఖమొసంగఁ జాలవైతివే ? అయ్యో ! ఈదుఃఖము నే నెట్లు తాళుదు ? నాకేల యీకన్నీరు కలుగుచున్నది ? ఇవి క్రూరాత్ములుగదా ?

జగం—కామినీ—చూచితివిగదా ! నీసోమశేఖరుఁ డెట్టివాఁడాయెను ? ఇట్టివాని నీవు పరదైవమంచు నమ్మి నీకై పరితపించుచున్న నాగకేతునిఁ గన్నెత్తియైనఁజూడవైతివి. ఇదిపాడియగునా ?

నీల—జగంధరా ! ఇట్లాడుటకా నీ విందువచ్చినది? ఇప్పుడా నీవు నానాథుని గుఱుతించిన చందము చెప్పవచ్చినది?

జగం—భామామణీ ! దీర్ఘముగా మాటలాడుట కవకాశము లేదు. ఇంత తెలిసి యయి న నిప్పుడయిన నా నాగకేతుని ననుగ్రహింతువా ? అతని నిప్పుడే పిలుచుకొని వచ్చెదను.

నీల—ఛీ ! దురాత్మా ! తొలఁగిపొమ్ము.

తే॥ గీ॥ ఔరయిది సమయంబె దురాత్మనీకు ।
నాగకేతుని వర్ణింప నానలేదె ।
నీవునీనాగకేతుండు నీరరాశి ।
గుండుమెడగట్టి పడిచావఁబొందునేఁడు ॥

నీనాగకేతుఁడును నీవును సముద్రమునఁబడుఁడు.

జగం—అతివా ! ఇంకూరకమాటలేల ? నీచరిత్రమంతయు విశదమయ్యె. పురుషవేష మున లోకమునంతయు వంచించితివి. కళావతిని మోసపఱచి చంపితివి. ఈరాకు మారు సోమశేఖరు విషమిడి పొలియించితివి. ఈవృత్తాంతములు నేఁడప్పు నితరు లె ఱుంగరు. నీప్రాణము నాచేనున్నది. ఇసుమంత వెలిపెట్టితినా? నీవేమగుటయునీవే యెఱుఁగుదువు. ఇప్పుడైనఁజెప్పుము. దీనినంతయు బయలుపెట్టక నాహృదయపేటిక లోననే దాఁచిబీగము వేసికొని యుండుట నీవానాగకేతునిఁ బెండ్లి యాడుటను సమ్మతించుటయను కార్యమునకుఁ బ్రత్యుపకారకరణముగా నుండఁగలదుకాని—

(అనుబంధము 35.)

నీల—(జగంధరునిఁ బట్టి పడవేసి) క్రూరాత్మకా ! ద్రోహీ ! నీవేలదీని వెలిఁబెట్టవలయు? నీపని నేనేయొనరింతును. (గట్టిగా) ఓపురజనులారా ! ఓపుణ్యాత్ములారా ! దారిఁ బోవునోమహానీయులారా! వినుఁడు వినుండు నేఁగ్రూరమానసను. కళావతిని మోస పుచ్చిదాని చావునకుఁగారణమైనదానను. ఈసోమశేఖరు విషయోగమున వధించు టకుఁగారణభూతను రండు, రండు. చూడుఁడు, చూడుఁడు.

ప్ర: చతురవర్మ అంగారశర్మ, మీననాథుఁడు, (శీఘ్రగమనమున.)

అందఱు—ఏమి ? ఏమి ? ఏమి ?

నీల—ఈరాకుమారుఁడు సోమశేఖరుఁడను భూపాలరాజు కుమారుఁడు. ముక్తావళియ ను ఘూర్జరరాజుతనయను మోహించియుండెను. వారిరువురి చరిత్రము దీనిఁజూచిన విశ దమగు (కాగితమిచ్చును.)

అంగార—(చదివి) ఎవరాముక్తావళి ? ఎవ్వరది ?

నీల—ఈహతభాగ్యురాలే యాముక్తావళి. (స్త్రీయగు)

చతుర—హా ! హా ! దైవమా ! (మూర్ఛిల్లును)

అంగార—వైద్యులఁబిలిపింపుఁడు.

(అనుబంధము 36.)

ముక్తా—ఈమనోహరుని మోహించినందుకు ఫలముగానితనియాలింగన సుఖమొకసారి గంటి. భోగమెఱుఁగఁగదా ? భుక్తశేషభోజనమును నెఱుఁగ. అది యిప్పుడనుభవింపఁ గలదు. ఇదియేభుక్తశేషము. (అనిజీవారిరసముదిని మూర్ఛిల్లును.)

విలాస—(లేచి) ఏమీకలకలము ? పితృవ్యా ! ఇదియేమి ?

అందఱు—(ఏడ్చుచు) కుమారా ! ఈచరిత్రము చదువుకొనుము (పత్రికనిచ్చును.)

విలా—(చదివి) అయ్యో ! ఎంతపాపాత్ముఁడను ? శ్రీపార్వతీమహాదేవుని జీవారిరసము ప్రభావము జగద్విదితమైయున్నది. గానికింకఁ బ్రతికింపలేను. పితృవ్యా! నాప్రాప్తి యిట్లున్నది. (నాగకేతుఁజూచి) అయ్యా ! నీవేల యిట వచ్చితివి ? నీవునన్నా నాఁడుచూచిన బోయవుగదా ?

అంగా—అయ్యా ! ఇతఁడు బోయగాఁడు. నారాజ్యముననున్న జగన్మోహనుఁడను చిత్రకారుఁడు.

విలా—ఆనాఁడు బోయవేషమేలధరించితివి ?

జగం—నీకువివాహయోగమునఁ గన్నులకుఁజాంచల్యము గలిగియున్నది. నేనెన్నఁడు బోయ నైయుంటి ?

మీన—(చూచి) కాఁడు. కాఁడు. వీఁడునాగకేతుఁడను రాజపుత్రుఁడు. సౌరాష్ట్రపురి కారాగృహమున నాఁడుచూచియుంటి. ముక్తావళిపై మోహమునఁబరితపించుచుండెను.

విలా—అట్లనా ? పితృవ్యా ! నాకొక బోయ యావృత్తాంతము చెప్పెనని యంటినే. వాఁడేవీఁడు.

మీన—దురాత్మా ! ఇప్పుడు తెలిసెను. వృత్తాంతము చెప్పుము. చెప్పకున్న.—

జగం—ఇంకనాకేల ? చెప్పెదలెండు. నేనునాగకేతుఁడగుట నిశ్చయమే, బోయనగుటయు నిశ్చయమే, ముక్తావళిని మోహించియుండుటయు నిశ్చయమే. ఇంకమీఁద మనుకొన్నదది యంతయు నిశ్చయమే ?

విలా—నీవునాతో నాఁడన్నమాటలన్నియుఁ గల్లలా ?

నాగ—శుద్ధాబద్ధములు.

మ॥ ఇఁకమీకేటికిఁ దావఁగావలయునే నేనాగకేతుండ నిం ।
దకునెల్లన్మతిపాత్రభూతుఁడఁ బ్రమోదంబారముక్తావళీ ।
వికచాబ్జాత ముఖిన్వరించినమనోభీష్టంబునన్ దానిపా ।
ణికిఁగానింతయొనర్చితిన్ముదము నిండన్ జాలు నేఁబోయెదన్ ॥

మీన—తే॥ గీ॥ ఛీ! జగద్ద్రోహిపాపాత్మ సిగ్గులేక ।
పోవఁజూచెదెయింత దుర్బుద్ధిగలదె ।
యీసతీమణిపాణికై యాసఁగొంటి ।
నిదియెపాణిగ్రహంబు నీకిత్తుగొమ్ము ॥—

పొడుచును.

నాగ—అయ్యో! అయ్యో! (క్రిందఁబడిచచ్చును.)

విలా—హా! దైవమా! నాయట్టి పాపాత్ముఁడెందైన వినఁబడెనే ?

ముక్తా—(మేలుకాంచును).

సోమ—ముక్తావళీ! నీశుద్ధమానసమింతైన గుఱుతింపనైతిఁగదా? జగంధరుఁడను చిత్రకారుఁడైయుండిన యీనాగకేతుఁడు బ్రోయవేషమున నాతో నీపై లేని నిందలు మోపెట్టి వృత్తాంతములన్నియుఁ జూపఁగా నీపైఁ బగపట్టి యింతకార్య మొనర్చితి. నేఁగృతఘ్నుఁడ. క్రూరాత్ముకుఁడ. మలయదత్తుని జీవారిరస మహోఘమగుట జగమంతయు నెఱుఁగు. ఎట్లును జావనున్నారము. నాసర్వాపరాధములు క్షమించితినని నీవభయమిచ్చిన నిశ్చింతముగాఁ జచ్చువాఁడసుమా!

(అనుబంధము 36.)

(అని కాళ్ళపైఁబడును)

ముక్తా—(లేచి) నాథా! నీయెడ నపరాధముండునా?

మీన—హా! ముక్తావళీ! (మూర్ఛిల్లును)

విలా—హా! జనకా! మీననాథా! (ఏడ్చును)

సోమ—అయిన నన్ను క్షమించితివా? కడమాట యపేక్షముగ నాకాలింగన సౌఖ్యము నిచ్చెదవా?

ముక్తా—నాథా! నాపుణ్యమసమానము. నేఁజచ్చుటకు మున్దొక్కనాఁడైన నీ ప్రేమాలింగనము వడయవలయునని యభిలాషము నేఁడు పూర్ణమయ్యె. (ఆలింగనముచేసుకొని మూర్ఛిలును.)

నిడితిరిగఁబాపై అగ్నిస్తంభ సౌషధమువలన నాయమశరీరము దహింపఁబడదయ్యె. ఇంతలో రాత్రియాటచే మీరంటికేతెంచితిరి. నేనంతలో ఘోరాకారము వహించి యక్కడి కావలివారిని బెదరించి పాఱఁదోలి కళావతిని వెలుపటికిఁదీసి నాయింటికిఁ గొనిపోయి చికిత్సయొనర్చితి. ఏఁడెనిమిది దినములలో నామెకుఁదెలివిఁ గలిగి యించుక శక్తివచ్చె. ఈనాఁడు మీరెఱిఁగిన ముక్తావళి చరిత్రమంతయు నాయమనోట వింటిని. అద్భుతమాయె. తండ్రిని, గృత్రిమపతినిఁ జూడవలయునని మిక్కిలి యభిలాషమున నన్ను వేఁడినను నేనందున కియ్యకొనక యింటినుండి వెలికి రానియ్యనైతి. ఆయమకుఁ బూర్ణముగ నారోగ్యము గలిగిన పిదప సమయము చూచి మీకొప్పగింపవలయుననియేయుంటి. ఇంతలో సంవత్సరమాయె. మీరీ కేరళపురికి వెడలి వచ్చితిరి. మీరు వెడలివచ్చిననాఁడే ముక్తావళియే నిక్కంపు పురుషుఁడైవచ్చునను భ్రాంతికలిగించు రూపముగల నీవీరసేన రాజకుమారుఁడయ్యెడ కేతెంచె. నేనును భ్రమించితి. అతని సఖ్యము వడసి యతని చరిత్రము నెఱింగితి. అతఁడు ముక్తావళి యన్నయనియు, జగంధరుఁడను చిత్రకారుఁడైయున్న నాగకేతుఁడను రాజకుమారుని వలన ముక్తావళి పాండ్యనగరమున నున్నదనియు నాముక్తావళికి సోమశేఖరునకు వివాహమాజగంధరుఁడు తానేకలిగించి యున్నాఁడనియు నెఱిఁగి ముక్తావళిఁగాంచుటకై యతఁడు పాండ్యపురికి వచ్చెననియు నెఱిఁగితి. మంచి సమయమని యెంచి యిక్కడికిరువురఁ దోడ్తెచ్చితి. వచ్చినవెంటనే మీచరిత్రము వింటి. ఇంక నాలస్యమేటికి భగవానుననుగ్రహమున మీకీ సంతసమొదవినది. ముక్తావళి నీసోమశేఖరునకు నిందేపరిణయము గావింపవలయు.

(అంపలు కళావతి నాలింగనముఁచేసికొని.) కానిండు. కానిండు.

మీన—"తదేవలగ్నం సుదినంతదేవ." (మంత్రము చదువును)

ముక్తా—తాతఁడు. పతివ్రతాతిలకమగు నింపు లేఖమూలమున మాకీసంతోషమొదవె. ఆయింగులేఖ యీసోమశేఖరున కగ్రమహిషి కావలయు. నేనధివిన్ననై యితని భోగినినయ్యెద.

వివాహములు జరుగును.

మంగళం పాడుదురు.

ముక్తావళి నాటకము సంపూర్ణము.



# అనుబంధము. (Appendix)

1. రాగం ధన్యాసి. తాళం రూపకం.

చారు—వింత వినరె మంత్రులార-చింత సేయఁగా ||ప||
నింత కాపరంబెకలదె-సంతసంఁబిక. ||అ||

సునీ—ధారుణీశ వలవదింక-నూరకుండఁగా
ధీర భంగిఁదీర్పవలయు-వైరమెందును. ||౧||

2. రాగం-బ్యాగు. తాళం-ఆది.

అందఱు—వనమెంతో-ఘనంబయ్యెన్-వినోదంబై-లతాంగి
ఘనతుంగా-వనీజంబుల్-వినువీధిన్-గనంబౌత ||పల్ల||
అరుదయ్యెం-గరంబిందు-తరుపాళీ-విలాస
మిఱులెందున్-గరాళించెన్-భరమాయె సరోజాక్షీ. ||౧||

వగలైనం-దిగంబౌఱి-దిగుల్నించెన్-మదించి
మృగపాళుల్-వగల్మీఱెన్-నగసీమన్-వగలాడి. ||౨||

3. రాగం-నాదనామక్రియ. తాళం ఆది.

ముక్తా—చెలులా-రానను-గావరే-యో ||ప||
ప్రాణసఖులనుచు-నేనెరనమ్మితి
నీనెఱిఁబుణ్యాము-చూపరే. ||౧||

గాసిలకిదియా-యాసమనకయా
భాసురాంగునిగరు-ణింపరే. ||౨||

4. రాగం-జంజూటి. తాళం-ఆది.

సోమ—వర-మరాళగ మనా-నీవెవరే ||ప||
ధరోద్య దురోజసరోజనేత్రి|| వర ||అ||
వైభవమయ్యో-నీభక్తిఁజూడ
నాభాగ్యదేవత-నీవే నేఁడిందుముఖీ. ||మ|| ||౧||

మాన్యతమీరె-మహిమము సేరె
ధన్యత చేకూరె-పుణ్యముమీరెప. ||౨||

5. రాగం. మోహనకళ్యాణి. తాళం ఆట.

ముక్తా—చూడవే బాలనా-మోహనాంగుఁడేడే లేఁడే ||ప||
వాఁడేమాయె. తాళఁజాలనే. లేఁడే రాఁడే. ||అ|| ||౧||

మారసుందరుని-నాకునిచ్చు-వారేలే రే
నాగులారా-మీరు వేగమే-పోరే తేరే. ||౨||

6. రాగం కమాజు తాళం ఆట.

సోమ—తగునెయీమాటలాడఁగా-మదిలో
వగవక తెగడఁగనిటు (పల్ల)

కడుకొనియీగతి-కష్టపుమాటలు
దుడుకుతనంబున-దొడబడకే-నుడివినపడిఁబోడిచెడ ||౧||
నింకొక చోటను-సాలాత్ముఁడయిన
నాయెదుటఁ-బలికినఁ దలఁపఁగలదె ||౨||
దుర్మతిని కీకర్మ మేలా-మర్మము చీలదె-దుర్మదాంధా
యెంచక యీలాగేలరా.

7. రాగం-పీలు. తాళం.

ముక్తా—సంతాపమాయెఁ-జాలఁగ నాకుఁ
గాంత కొనను నెంచి-కరుణింపవే (పల్ల)

శోకాంబురాశి-పారిదిమునిఁగితి-వేకారిదరిఁజేరవిధిగానక- రా
కేందుముఖినా-యాకులగతిదీర్చ-నీకంటెసఖులింక నాకెవ్వరే

8. రాగం-వరాళి. తాళం.

ముక్తా—వేవేగమే-కావవె కరుణించి
భావమునను వేలు-త్రోవగానని నన్ను (పల్ల)

కడుదయచేనన్నుఁగావకయుండిన
బడలికనసువుల-విడుతునె చారుహాస. ||౧||

9. రాగం-నాదనామక్రియ. తాళం-ఆది.

సోమ—పావనపోషణ-కావవె దేవా
భావముననునిన్-భక్తినిగొలిచెద|| (పల్ల)

నీరమణీయుప-దారవిందంబులె
సారెకుఁబాయక-సన్నుతించెదనన్
జేరికావ-యిటు-కోరిరా వా-సము
దారభావ-నా-ప్రారబ్ధ మెటులున్నదో.

10. రాగం-సావేరి. తాళం-ఆట.

సోమ—సంతాపమే-తీఱెను
వింతగునెంతోమది సంతోషముచింతించఁగ|| (పల్ల)

మేనునఁబులకలు-మానుగఁగలిగెడు.
మానసమునఁగడు-నానందముఁజూనారెడు|| ||౧||

ఏమనితెలుపుదు-నెంతనిపొగడుదు
నామదిఁబ్రేమాయతి-వేమాఱునుగామించఁగ|| ||౨||

11. రాగం-యదుకులకాంభోజి. తాళం-ఆది.

ముక్తా—చేకొనవే-నాథ-నాకా-నందము గలిగె ||ప||
ప్రాకట కరుణా-లోకముగలుగ ||అ||
అరుదుగనిన్నే-నిరతముఁ దలఁచితి
కరుణముక్తావళీ-కాంతనునన్ను. ||౧||

12. రాగం-జంఝూటి. తాళం-ఆది.

సోమ—మనసారనింత సంతసంబుమీఱె-నెకోకిలవాణీ || (పల్ల)
ఘనతాపముదీ-ఱెనుగా-వనజా-తముఖీ|| (అను) ||౧||

ముక్తా—ముదమాయెజాలనింక లేదునాకును-ఖేదముసునాథా ॥ (పల్లవి)
మదికింపుగ నీ-యదనన్-ననుంగాంచుటచే. ॥౨॥

సోమ—అలివేణియీ-వెలలేనిసాం-పులజిల్కు-నీ-బలుసంగతిన్
నేనేకడన్-ధన్యాత్ముండన్-నానోముఫలే-జూరాగా. ॥3॥

ముక్తా—మననేర్చితి-న్మనుజేశనీ-ఘనసంగతి-న్ననుమెచ్చంగా
నింతేటికిన్-ప్రాణేశనా-సంతోషమే-నిండారగా. ॥౪॥

13. రాగం-కాంభోధి. తాళం-అట.

చారు—ఏమదిచిత్రమో-యేమియుతెలియదు
నామదికెందుకో-నమ్మిక గలుగదు. ॥౧॥

వారకయీయతి-కాగ్రహంబున
కీరీతివచ్చిన-కారణమేమియో. ॥౨॥

14. రాగం-బ్యాగు. తాళం-రూపకం.

చారు—వగనించుచుబో-వగనే-టికి
తగునే-ననుఁబాయఁగనో తనయా॥ (పల్ల)
ఘనభాగ్యమునిమించినయోసుతా
నినుఁజూడకనే-మనఁగాగలనే. ॥౧॥

15. రాగం-ధన్యాసి. తాళం-రూపకం.

నాగ—క్రూరమైకడుఘోరమాయె నే-నాదారిజూడఁగ
నారినిన్గన్నారఁజూడఁగ-నేరనైతినే-సారసాక్షిరా.
ఎందుకన్నుల విందుగానిను గందునందముగా
ఓసుందరీకడుమంద భాగ్యుండముందునేనికనెందుబోదును॥౧॥

16. రాగం-బెహాగ్. తాళం-రూపకం.

ముక్తా—సుందరుగనులార నే-జూడనైతి
నేఁజూడనైతిము-ద్దాడనైతి॥ (పల్ల)

అంతయు క్షణమున-నంతగతిఁబొందెను
ఇంతటిసంతాపము-స్వాంతమునకయ్యె. ||౧||

17. రాగం-శంకరాభరణం. తాళం-ఆది.

నాగ——సుందరినివిడిచిచననా-తరమ-భరమా
నారి-గోరి-మేరమీరి-చేరికేరి-క్రూరుఁడా
మారుశరంబులఁబూరికి-సారెకుబడలితినిఁక. ||౧||

18. రాగం-సావేరి. తాళం-రూపకం.

సోమ——మనగలనే-ఆహా-ఓ
వనితామణినిన్ను-జూడక|| (పల్ల)
వనరాశిని విధిదూరుచు-నను నెంచుచు నేమైతివో
ఘనవేణీ-సుమపాణీ-కలవాణీ-సునితంబనిరమణీమణి. ||౧||

19. రాగం-శంకరాభరణం. తాళం-రూపకం.

చతుర——సారమైగంభీరమాయెగా-నీదారిఁజూడఁగ
భూరిరాజ్యము-తోరహించిన-నారీమణిని-గోరవైతివి. ||౧||
ధారుణీశకుమార నీసము-చారవంశమును-ఈదారిసారెకు-
చారహించదె-కోరిమెచ్చితి-ధీరచరిత. ||౧||

20. రాగం-కానడ. తాళం-ఆది.

నీల——రాకేందువదనా-రమణీ-తగునే
నాకీ-వరుస-నళిన-నయనా|| (పల్ల)
ఈ-లాగునన్నుఁగోరనీకు బాగుగాదబలా
రాగం బోకచే-రసమా-యశమా.

21. రాగం-ఆనందభైరవి. తాళం-ఆది.

కళా——పర-దినాధిపాంచిత-భావా-నా
పానోజదయుగసలేవా || (పల్ల)

కాంతా-ఏటికినింత-తీరనివంత-మదగదునాకీబలు
వంత-యెంతయుజింతించితి-సంతాపము-వింతాయెను॥

22. రాగం-ఖమాజు. తాళం-ఆది.

నీల——మానినీమణీ-మానవేలయింత-కానక పలికెదు
పూనియీవిచారమేల-పొగులగ - సుఖమును - గలుగదు-
తగదిక॥ (పల్ల)

కళా——ప్రాణనాయకా-దీనగీతిగలుగ-నేనిక బ్రదుకను
మానవేశనిన్నుగాక-మనసుననెపుడును గనఁగదయితగల.

నీల——బాలా-తగదీ-పగిది-కడు
జేలవైతిచాలదుఃఖ-లీలలబడియెదు. ॥౧॥

కళా——నాథా-చనవీపలుకుల్-కడు
బాధలేలకల్గుకార్య-సాధకమగుగద. ॥౧॥

23 రాగం. తాళం.

కళా——నా-ప్రాణనాథాయీవే
నాకా-లింగనంబు॥ (పల్ల)
పాలింతువేని నాయాశ
లాలించినన్ను ప్రాణేశ
లోకానీ-కౌగలియీవే.

24. రాగం-బ్యాగు. తాళం-ఆది.

నీలా——భళీకళావతి-భళీరెనీవునాప్రాణపద మోయలివేణీ॥ (పల్ల)
సతీమణి నాకును-స-ద్ధితంబుచేకూర్చితి
నుతింపఁగారాదె నీదుచరిత-యో
పతివ్రతామణి-రావే-యీవే-లేవే-కౌగిలి. ॥౧॥

25. రాగం-ఖమాజు. తాళం-ఆది.

జగ——నేఁడేకలుగదె-యీడులేనిసుఖము॥ (పల్ల)
వాడవాడచుట్టి-చుట్టివచ్చివేసరితి.
జూడఁగాబోలునీ-చేడెయెముక్తావళీ॥ (అను)
కడకీచోటను-పొడగానఁగనయ్యో
బడలితిని నింకనా-భాగ్యమెట్లున్నదో.

26. రాగం-పీలు. తాళం-ఆట.

నీల——సన్నుతించెద-వైద్యచంద్రమా-విన్నపంబుచేకొని
యున్నదేయేమైననాశ-యున్నమాటచెప్పవే॥ (పల్ల)
అర్భకుండనంచు-చూడకు మాతురంబు చూడకు
దుర్భరంబైతోచెనాకా-నిర్భవించెశోకము. ॥౧॥

27. రాగం-కానడ. తాళం-ఆట.

బోయ——మోసమాయె-నాయాసమాయె
వాసిఁజెందిన-పరువంబుపోయె॥ (పల్ల)
దానిమాటలనమ్మి-లేనియాసలజెంది
యానందముభాగ్య-మటుగోలుపోతి. ॥౧॥

28. రాగం-అఠాణ. తాళం-రూపకం.

బోయ——పడిపొమ్ము నీవుపాపీ-యిట్లనె
జడుఁడైన-నీకునైకదా-యడలించెనన్ను ముక్తావళి॥ (పల్ల)
ఇఁక మోదమాయెనాకు - సకలంబు సాధకంబుగా బ్రకటించు
వాడవెంట నే-శుకవాణినన్నుఁజేపట్టదె. ॥౧॥

29. రాగం-ఖమాజు. తాళం-ఆది.

విలా——నారీ-కోరి-యీరీతిఁజేసితే
రి-వైతే-నాపాలికి మరణమైనరాదాయె॥ (పల్ల)
వైసలకై ననువ-లపదీదుఃఖము
బ్రూగకన్నరాలిసయ్యో-జేరికోరిపాపైతి. ॥౧॥

30. రాగం-కమాజు. తాళం-ఆది.

విలా——మన-సాతలఁపకు-నారులకూరిమి -మనసాతలపకుకొనసాగనిదది
వననిధిమునిఁగి-దరిజేరఁగజాలవు॥ (పల్ల)
స్నేహముగలుగదు-నిలుకడవెలయదు
మోహమనఁగనున్న-ముద్దులుమిన్న
ద్రోహఁపుచింతయె-శోచునుమదినిండ
దేహమువడిఁదెగ-దీసెదుబాసలు. ॥౧॥

31. రాగం-నీలాంబరి. తాళం-రూపకం.

నీల——ఏమిపాపకార్యమాయెభామా ॥ (పల్ల)
ప్రేమజాడనేటికింక-కోమలాంగికామినీయిదేమి ॥ (అను)
చింతయేటికింకనన్ను-నంతమొందజేయరాదె
నన్నింతగా-ననంతమై-నవంతపాలు
పరపితి సుందరి నెలకొని. ॥౧॥

32. రాగం-శహాన. తాళం-రూపకం.

కళా——ఈ మాటలెల్లనాథనీ-వేమంచునాడితి
నామీదగోపమూనఁగా-నేమంటివల్లభా॥ (పల్ల)
ప్రాణేశయీమనోవ్యథ-బూనఁగనేటికి
మానవె ఘోరకార్యము-నేనిన్నువేడెద. ॥౧॥

33. రాగం-భ్యాగ్. రూపకము.

విలా——రాకుమారపోలడిట్లు-వ్యాకులింపఁగా
శోకవారాసి-మునిగినీకమానఁగా.
ఎన్నినాళ్ళుదుఃఖపడిన-నెంచిచూడుమా
నన్నుతాంగినీకుజిక్కి-యున్న దేభువి.

34. రాగం-బిలహరి. రూపకం.

విలా——ఏమికారణమో-నామనసంబున-వెలియదుగద-యిది ॥ (పల్ల)
భామామణి (ని)-నామంబనిగను-సోమసేఖరఁడనే.

ఈ కుమారునిపోకజూడఁగ నాకువింతగుశోకదోచెను
ఏకైవడియొ-యీకాతరము-చీకాకుఁజెందెను. ||౧||

35. రాగం-నాదనామక్రియ. తాళం-రూపకం.

నీల.——ఇదిఫలమాయె. దైవమా-మహోపాయం బయోకలిగె.
విరోధంబీ-గతింజేసి-నిరాశయీ-పరిపాటికరాళంబై-నపాటిడి
నించిరాయిడిజేసితేనేడు.

36. రాగం-పీలు. తాళం-ఆట.

విలా——బాలమనసున-సంతోషమాయె.
నీలీలవాసన-నేనెందుజూడ || (పల్ల)
అమమాయిదేపదార్థమొలేకయమృతమొ
తమకించెమడిదీని-దమినింతతినఁగ.

37. రాగంపీలు. తాళం-ఆది.

నీల——ఇటు-కరాళగతిబోయెదవే-యో-ధరేశనాథ || (పల్ల)
మానసీకై-నేనిలఁబ్రదికితి
ప్రాణేశనన్నుబాసెదవే-యభిమానముమాని. ||౧||

38. రాగం-మోహన. తాళం-ఆది.

జగ——కనలేవేకామినీ-కాంచితి సాహసకార్యములెల్ల|| (పల్ల)
ఈవిధమంతయు-నేవెలిఁబెట్టిన
నీవగయేమగునోవనితా. ||౧||

39. రాగం-పీలు. తాళం-ఆది.

ముక్తా——వెడలెదనేమీ-వెంటనే-యిదె|| (పల్ల)
కడుకోని నేలపై-పడియెనునావిభుఁ
డు డుగకయీతని-గడసారిబోడగని. ||౧||

40. రాగం-కేదార. తాళం-రూపకం.

సోమ——నను-రమ్మనవే-వర-సమ్మోదముచేకొమ్మని
నెమ్మిన్నారి దయఁగనవే-
ఘనసమ్మదమ్ము నెమ్మనమ్ము-గ్రమ్మఁగా (పల్ల)

మానినీ-నావగ-మానిచి-నీదయ (వేగ)
బూనినసంతోషముగాఁ బ్రాణములనుమానెద. ||౧||

41. రాగం-బ్యాగు. తాళ-ంఆది.

చతుర——అమ్మరోనా-కిమ్మాట-నెమ్మిఁజెప్పలేవైతి.
ఇమ్మేన బ్రాణంబుల-నేనెమ్మాడ్కి- ధరియించద
నోకొమ్మ నేఁడు. (పల్ల)
ముందొక్క- నాథైననే-బలు-చందమువివరించితే మందొల్ల
నన్నునీమాటనేనరసితి - మందభాగ్యుఁడనే- నెందుబోదుసుం
దరాంగి. ||౧||

42. రాగం-పీలు. తాళం-రూపకం.

సోమ——కలదే-మఱివే-ఱిలఁగా-రణము
తొలిజన్మము నందలిపాపముగా-హా-హా. (పల్ల)
అదిరా-గదిరెన్-దుదకీ-గతిగా
నిద్రప్రాప్తిగదా-గదలం-బొడిచెన్-హా-హా.

మంగళము.

ఇంగ్లీషు నోటు.

అందంబొ-శుభనిచయం
బిందీవర-నయనుఁడుతా
వందారుల్-మోదముగన
వరదయచే నొసగన్ ||
డెందంబుల్-దృఢమగుబల్
చందంబున్-బదిలముగా
జెందించి-శ్రీనాథున్
వందించి-సేవించి
బృందారక-నుతునకునత
మందారున-కఘహరునకు
నెందున్-గజవరదునకున్
హితగతి-మంగళమనరె || ||అంద||

ముక్తావళినాటకము సంపూర్ణము.